పార్లే

# మెలడీ సమర్పిస్తోంది అంకుల్ స్క్రూజ్ ను రాపర్ దోపిడీ లో.

వీల్లేదు అబ్బాయిలూ
నా ఖజానాను
ముట్టుకుంటే ఊర్కోను.

కంగారు పడొద్దు అంకుల్.
మాకు కావల్సింది
మీ మెలడీ రాపర్లు మాత్రమే,
10 రాపర్లకు ఒక స్టికర్
ఉచితంగా దొరుకుతుంది.

## మీ డిస్నీ స్నేహితుల స్టికర్లు ఉచితంగా!

రండి పిల్లలూ! మీ ప్రియమైన డిస్నీ స్నేహితులను సేకరించటం వెంటనే మొదలు పెట్టండి. ఇందులో మొత్తం 30 ఉన్నాయి. ప్రతి స్టికర్ కోసం మీరు ఏం చెయ్యాలంటే, 10 మెలడీ టాఫీల రాపర్లు, మీ సొంత అడ్రెస్ వ్రాసిన ఒక కవరుపై 50 పైసల స్టాంపు అంటించి ఈ చిరునామాకు పంపండి.

మెలడీ టాఫీ, పార్లే ప్రొడక్ట్స్ ప్రై. లి.
నిర్లాన్ హవుస్, 254-బి, డా. అనిబిసెంట్ రోడ్,
బొంబాయి-400 025.




కొత్త పార్లే

# మెలడీ టాఫీ

కారమెల్ మరియు చాకలెట్ యొక్క రుచికర మధుర సంగమం.



everest/83/PP/311-tl

ప్రవేశ రుసుము లేదు



# చందమామ కేమెల్

## రంగుల పోటీ

**బహుమతులు గెలవండి**

**కేమెల్**

1 ప్రథమ బహుమతి రూ. 15/-
3 రెండవ బహుమతి రూ. 10/-
10 మూడవ బహుమతి రూ. 5/-
10 సర్టిఫికెట్లు

చుక్కలు గుర్తున్న గీత వెంట కత్తిరించండి.

ఈ పోటీలో 12 సంవత్సరాల లోపల వయస్సు కల పిల్లలు పాల్గొనవచ్చు.

పైన చూపించబడిన చిత్రాన్ని పూర్తిగా కేమెల్ రంగులతో నింపి దిగువ చిరునామాకు పంపండి:

పో. బా. నం. 9928 కొలాబా, బొంబాయి-400 005.

న్యాయనిర్ణేతలదే చివరి నిర్ణయం. దీనికి అందరూ కట్టుబడాలి. ఈ సంబంధంగా ఎలాంటి పత్ర వ్యవహారాలు జరుపబడవు.

Name:.................................................................Age:..........................

Address:.................................................................................................

.............................................................................................................

ఈ తేదీ లోపల ఎంట్రీలను పంపండి: 31-1-1984

**CONTEST NO34**

Vision/CPL 83169Tel.

# చందమామ

సంస్థాపకుడు : 'చక్రపాణి'
సంచాలకుడు : నాగిరెడ్డి

ఈ నెల బేతాళకథ [''పద్మనాభుడి పెళ్ళి'']కి ఆధారం యన్. శివనాగేశ్వరరావు రచన.

మనిషి లేనిపోని ఆశలకు పోక, ఉన్నంతలో తృప్తిపడాలన్న సలహా, మంచిదే. కాని, పరిస్థితుల ప్రభావం అందుకు అనుకూలించనప్పుడు మనిషి ఉన్నదానిపట్ల అసంతృప్తి చెందక తప్పదు. అది, లేనిపోని ఆశలకు పోవడం కాదు. ఈ వాస్తవం ''పెట్టుబడి ఉచితం'' అన్న కథలో తెలుసుకుంటాం.

## అమరవాణి

వసంతే జ్ఞాయతే భేదః, కాకస్య చ పికస్యచ,
సతశ్చ వ్యసతో భేదః, సమయే ఏవ జ్ఞాయతే.

[కాకి, కోకిల ఒక్కలాగే కనబడతాయి. కాని, వసంత ఋతువులో వాటి భేదం తెలుస్తుంది. ఉత్తముడూ, అధముడూ ఒక్కలాగే కనబడతారు. కాని, అవసరంలో వాళ్ళల్లోని భేదం తెలిసిపోతుంది.]

సంపుటి 74 జనవరి '84 సంచిక 1

విడి ప్రతి : 2-00 :: సంవత్సర చందా : 24-00



# చందమామ కబుర్లు



## ఆజ్ఞలు పాటించే ఓడ

జపాన్ దేశానికి చెందిన కినొకావామారూ అనే ఓడ, నావికుడు 'పో' అంటే ముందుకు పోతుంది. 'ఆగు' అంటే ఆగుతుంది. ప్రపంచంలో ప్రప్రథమంగా మాటలతోనే అదుపు చేయగల యంత్రాన్ని అమర్చిన ఈ ఓడలో నావికుడి ఆజ్ఞలు విని, వాటి ప్రకారం ఓడను నడపడానికి ఇంజను గదిలో ఇంజనీరు లేడు. కాని ఆ స్థానంలో కంప్యూటర్ వున్నది.

## సౌరశక్తితో విద్యుచ్ఛక్తి



కాలిఫోర్నియాలోని 'సోలార్ ఒన్' అనే ప్రయోగశాలలో 1988వ సంవత్సరం నాటికి — పదిహేను వేల బ్రహ్మాండమైన అద్దాల ద్వారా సూర్యకాంతిని ఎడారిలోని ఉప్పుతటాకం మీదికి ప్రసరింపజేయడం జరుగుతుంది. దీనివల్ల యాభై వేల ఇళ్లకు సరిపడే విద్యుచ్ఛక్తి ఉత్పత్తి కాగలదని 'సైన్స్ డైజెస్ట్' పత్రిక తెలియజేస్తున్నది.



## ప్రపంచంలో పెద్ద పూల హారం

జమైకా (అమెరికా)లో ప్రసిద్ధుడైన భారతీయ యోగి చిన్మయ్ పది వేల గీతాలను పూర్తి చేసిన సందర్భంగా ఆయనకు ఒక పెద్ద పూల హారం సమర్పించారు. పది వేల పూలతో అల్లిన ఈ పుష్పహారమే ప్రపంచంలోకెల్లా పెద్ద హారమని చెబుతారు. యోగి చిన్మయ్ పాండిచ్చేరిలోని శ్రీ అరవిందాశ్రమంలో సుశిక్షితులైనవారు.

## మీకు తెలుసా?

1. భూగర్భంలో ప్రపంచంలోకెల్లా చాలా పెద్దవైన గుహలు ఎక్కడున్నాయి?
2. పెద్ద పెద్ద మంచుగడ్డలు ప్రపంచంలో ఏ ఏ ప్రాంతాలలో కనిపిస్తాయి.
3. ప్రపంచంలోకెల్లా ఎత్తైన జలపాతం ఎక్కడున్నదో మీకు తెలుసా?
4. ప్రపంచంలోకెల్లా పెద్ద అగ్నిపర్వతం ఎక్కడున్నదో చెప్పగలరా?
5. ఆసియా ఖండంలో అతి పెద్దదైన కృత్రిమ సరస్సు ఎక్కడున్నది?

(సమాధానాలు 64వ పేజీలో)




## 9

[మహామాయుడి నుంచి పింగళుడు అద్భుతశక్తులు గల వస్తువులన్నిటినీ హరించగానే, భల్లూక పర్వతాల మీద గల దుష్టశక్తులన్నీ విజృంభించినై. పద్మపాదుడు భల్లూకకేతుడి కోసం పింగళుణ్ణి పంపాడు. పింగళుడు భల్లూకకేతుణ్ణి తీసుకువచ్చాడు. అప్పుడు పిశాచాలన్నీ పెద్దగా అరుస్తూ భల్లూకకేతుడు వున్న చోటుకు పరిగెత్తుకు రాసాగాయి. తరవాత—]

తమ వద్దకు పరిగెత్తుకు వస్తున్న పిశాచాలను చూసి, పద్మపాదుడు చిరునవ్వు నవ్వాడు. భల్లూకకేతుడు మాత్రం వాటికేసి చూసి, అయిష్టంగా తల పక్కకు తిప్పి, పింగళుడికి ఎంతో వినయంగా నమస్కరిస్తూ, "ప్రభో, ఈ క్షుద్రజీవాలకు నేను నాయకుడుగా వుండలేను. దయవుంచి నన్ను మీ వెంట తీసుకుపొండి!" అన్నాడు.

పింగళుడు జవాబేమీ చెప్పలేదు. అప్పుడు పద్మపాదుడు, భల్లూకకేతుడి భుజం తడుతూ, "భల్లూకకేతా! నువ్వు ఈ పర్వత ప్రాంతాల, ఈ రక్కసిగణానికి నాయకత్వం వహించి బతకటమే అన్ని విధాలా మంచిదని నా అభిప్రాయం!" అన్నాడు.

"అయ్యా, ప్రభో! ఆ జీవితం ఇక నాకు వద్దు!" అంటూ భల్లూకకేతుడు,



పద్మపాదుడికి సాష్టాంగ ప్రణామం చేశాడు.

అంతలో పిశాచాలన్నీ వారిని. చుట్టుముట్టి, ''భల్లూకకేతా, మా రాజా! ఓహెూం! ఓహెూం!'' అంటూ అరవసాగాయి. కర్ణకఠోరంగా వున్న వాటి వికృతనాదాలను విని, పింగళుడు చీదరించుకుంటూ, ''పద్మపాదా! నాకు ఒక మంచి ఉపాయం తోస్తున్నది. అలా చేస్తే, భల్లూకకేతుడికీ, మనకూ కూడా అన్నిసమస్యలూ విరగడవుతవి!'' అన్నాడు.

''ఏమిటదీ?'' అన్నాడు పద్మపాదుడు.

''భల్లూకకేతుడికి మనను సేవిస్తూ బతకాలని వుంది. ఆ కారణం వల్ల అతడు ఈ పిశాచాలకు నాయకుడుగా, ఈ పర్వతప్రాంతాల వుండేందుకు అంగీకరించటం లేదు. మనం ఈ పిశాచాలను ఇలాగే వదలిపోతే, అవి ఎలాంటి అఘాయిత్యాలు చేయగలవో మనకు తెలీదు. అందువల్ల వీటిని దుంపనాశనం చేయటమే మంచిది. వీటి మీద మహామాయుడి కత్తిని ఉపయోగిద్దాం!'' అన్నాడు పింగళుడు.

పింగళుడు ఇలా అనేసరికి, పిశాచాలన్నీ హాహాకారాలు చేసినై. అవన్నీ ఏకకంఠంతో, ''మహామాంత్రికులారా! మమ్మల్ని సర్వనాశనం చేయకండి. మా ప్రభువు భల్లూకకేతుడు మాకు నాయకత్వం వహించకపోతే, మేమే నాయకుణ్ణి ఎన్నుకోగలం!'' అన్నవి.

''అందుకు నా అభ్యంతరం ఏమీ లేదు. మీరు నాయకత్వపు సమస్యను ఎలా పరిష్కరించుకోగలరో చూడాలని నాకు కుతూహలంగా వుంది.'' అన్నాడు పద్మపాదుడు.

''మీ మానవుల్లో లాగానే మాలోనూ బలదర్పాలు గలవాడే నాయకుడు! ఆ శక్తులు ఎవరిలో ఎక్కువగా వున్నవో రుజువు చేసుకుంటాం!'' అంటూ పిశాచాలన్నీ బాహాబాహి, ముష్టాముష్టి యుద్ధానికి ఉపక్రమించినై.



"భేష్, ఈ పద్ధతి చాలా బావుంది!" అంటూ పింగళుడు చప్పట్లు చరిచాడు.

ఇక పిశాచాలు నాయకత్వం కోసం పోరు ప్రారంభించినై. అవి క్షణక్షణానికీ అనేక రూపాలను ధరిస్తూ యుద్ధం సాగించినై. పులిరూపం దాల్చినవాటిని మట్టుపెట్టేందుకు కొన్ని ఏనుగు రూపాలు ధరిస్తే, వాటిని హతమార్చేందుకు మరి కొన్ని పిశాచాలు సింహాకృతులు ధరించినై. కొన్ని నాగుబాములైతే, మరి కొన్ని గరుడపక్షులు!

ఈ విధంగా జరిగిన ఘోరసంగ్రామంలో చావగా మిగిలిన కొద్ది పిశాచాలు, చివరకు తమ నాయకుడుగా ఒక పెనుభూతాన్ని ఎన్నుకున్నవి. పద్మపాదుడికి, యీ విధంగా నాయకత్వపు సమస్య పరిష్కారమయినందుకు చాలా సంతోషం కలిగింది. అతడు, యిప్పుడు పిశాచాల నాయకుడైన పెనుభూతాన్ని దీవించి, "యిక మీరు స్వేచ్ఛగా, యీ భల్లూక పర్వతాలలో బతకవచ్చు. మీరు అహంకరించి మానవుల మీద కత్తి కట్టితే తప్ప లేకపోతే మీ జోలికి నేనుగాని, పింగళుడుగాని రామని అభయహస్త మిస్తున్నాను. యిక వెళ్ళండి!" అన్నాడు.

పిశాచాలన్నీ జయజయ ధ్వానాలు చేస్తూ తమ కొత్త నాయకుడైన పెనుభూతాన్ని భుజాల మీద ఎక్కించుకుని పర్వతాల మీదికి వెళ్ళిపోయినై. అప్పుడు పద్మపాదుడు, పింగళుడి కేసి తిరిగి, "పింగళా! మనం అష్టకష్టాల కోర్చి, కావలసిన శక్తులన్నిటినీ సంపాదించుకొన్నాం. యిందులో నీవు చేసిన సహాయం నేనెన్నడూ మరువరానిది. నీవు నీ యింటికి వెళ్ళేముందు, నాకు కొద్ది రోజులపాటు అతిథిగా వుండవలసిందని కోరుతున్నాను," అన్నాడు.

పింగళుడు అందుకు అంగీకరించాడు. పద్మపాదుడు ఓ చిటికెడు మన్ను తీసుకుని మంత్రించి భూమి మీద చల్లాడు. వెంటనే ఓండ్రిస్తూ పిశాచగార్దభాలు

పెళపెళారావాలతో భూమిలోంచి బయటికి దూకినై.

పద్మపాదుడు ఒక పిశాచగార్దభాన్ని ఎక్కి కూర్చున్నాడు. పింగళుడు రెండవ గార్దభం దగ్గిరకు వెళ్ళబోయేంతలో, భల్లూకకేతుడు అతడిముందు మోకరిల్లి, "ప్రభో! మీరు నా భుజాలమీద ఎక్కండి. నేను మీకు సదా సేవకుణ్ణి!" అన్నాడు.

పింగళుడు నవ్వుతూ, భల్లూకకేతుడి భుజాల మీద ఎక్కి కూర్చున్నాడు. పద్మపాదుడు కూర్చున్న గార్దభం గాలిలోకి లేచింది. ఆ వెంటనే భల్లూకకేతుడు కూడా గాలిలోకి ఎగిరాడు. రౌతులేని రెండవ పిశాచగార్దభం వారివెంట ఎగిరిరాసాగింది.

అడవులూ, కొండలూ, నదులూ దాటుతూ సూర్యాస్తమయం వేళకు వారు ఒకానొక నగరం సమీపించారు. పద్మపాదుడు కింద బొమ్మరిళ్ళలా వున్న ఆ నగర భవనాలను పింగళుడికి పేరు పేరునా చూపిస్తూ, "ఆ కొండ పక్కన పాములా కదులుతున్న సెలఏరు కనబడుతున్నది గదా! దాని వెంట వున్న ఆ చెట్ల గుంపు చూడు! అందులో పాలరాతితో నిగనిగలాడుతున్నదే, నా పితృగృహం! నా అన్నలిద్దరూ చిలకసరస్సుకు ఆహుతి అయిపోయారు. కనక, యిప్పుడు నేనే ఆ గృహానికి అధిపతిని. నా తండ్రి వదిలిపోయిన మంత్రగ్రంథం కూడా నాదే!" అన్నాడు ఉత్సాహంగా.



అంతలో పద్మపాదుడు ఎక్కి వున్న పిశాచగార్దభం క్రమంగా కిందకు దిగి ఎత్తయిన ప్రాకారం గల పద్మపాదుడి యింటిముందు ఆగింది. భల్లూకకేతుడు కూడా కిందికి దిగాడు. ప్రాకార ద్వారానికి గల పెద్ద యినప తలుపులముందు, యిద్దరు నీగ్రో బానిసలు పహరా తిరుగుతున్నారు. వారు పద్మపాదుణ్ణి చూస్తూనే, తమ చేతుల్లో గల శూలాలను పైకి ఎత్తి, "జై, పద్మపాదా!" అంటూ జయజయ ధ్వానాలు చేశారు.

పద్మపాదుడు గార్దభం మీంచి దిగి ముందు దారి తీశాడు. పింగళుడు కూడా, భల్లూకకేతుడి భుజాల మీంచి కిందకు దూకి అతణ్ణి అనుసరించాడు. అందరూ భవనం ముందుగల చిత్రవిచిత్రమైన చెట్లలోంచి నడుస్తూ, భవనాన్ని సమీపించే సరికి, మెట్లవద్ద తెల్లని బారెడు గడ్డంతో వున్న ఒక వృద్ధుడు ఎదురయ్యాడు. పద్మపాదుడు అతణ్ణి చూస్తూనే భక్తితో వంగి ప్రణామం చేసి, వెనుదిరిగి పింగళుడితో, "వీరే మా తండ్రి గురువులు!" అన్నాడు.

పింగళుడు కూడా ఆయనకు నమస్కరించాడు.

వృద్ధుడు అందరూ సమీపించేవరకూ ఆగి, తరవాత పింగళుడి కేసి వేలు చూపుతూ, "పద్మపాదా! యీ యువకుడెవరు?" అంటూ ఆగి, "అవంతీ నగరపు జాలరి కాదు గదా?" అన్నాడు.





పద్మపాదుడు అవునన్నట్టు తల వూపాడు. వృద్ధుడు పరమానందం పొంది, "అయితే, నువ్వు మహామాయుడి సమాధిలో గల అపూర్వశక్తులనన్నిటినీ వశపరుచుకున్నావన్నమాట!" అన్నాడు.

పద్మపాదుడు మారు మాటాడకుండా, తన వేలిన గల ఉంగరాన్నీ, వజ్రాలు తాపిన పిడి గల కత్తినీ, భూగోళాన్నీ వృద్ధుడికి చూపించాడు. వృద్ధుడు వాటిని కొంచెం సేపు పరీక్షగా చూసి, "పద్మపాదా! ఇక నిన్ను జయించగల మాంత్రికుడు ఈ ప్రపంచంలో మరొకడు లేడు. నీ తండ్రి ఎంతో ప్రయత్నించి కూడా సాధించలేకపోయిన వాటిని నువ్వు సాధించావు. ఆ విధంగా అతడి ఆత్మకు శాంతి కలుగుతుంది!" అన్నాడు.

"నా తండ్రి వదిలిపోయిన మంత్ర గ్రంథం యిప్పుడు నాదేగదా?" అన్నాడు పద్మపాదుడు.

వృద్ధుడు చిరునవ్వు నవ్వి, "ప్రపంచాన్నే జయించగల సర్వశక్తులూ నీ స్వాధీనం అయిన తరవాత, ఆ మంత్ర గ్రంథంతో నీకు కొత్తగా జరగబోయే మేలు ఏమున్నది? నీవు సంపాయించిన శక్తుల కన్న, అందులో గొప్ప శక్తులేమీ లేవు. తను సాధించలేకపోయిన వాటిని తన కొడుకుల చేత సాధింపచేయాలనే, నీ తండ్రి మరణించే ముందు, ఆ మంత్ర గ్రంథాన్ని గురించి అలాంటి షరతులు పెట్టాడు. మహామాయుడు నీ తండ్రికి ప్రబల విరోధి! నువ్వు అతణ్ణి జయించావు," అన్నాడు వృద్ధుడు.

వృద్ధుడు అంత చెప్పిన తరవాత గాని, పద్మపాదుడికి తన తండ్రి అభిప్రాయం ఏమిటో అర్థం కాలేదు. తనకు ప్రబల విరోధి అయిన మహామాయుణ్ణి, శక్తిహీనుణ్ణి చేసేందుకు ఆయన తనను ఉపయోగించుకున్నాడన్నమాట!

పద్మపాదుడు ఇలాంటి ఆలోచనలతో సతమత మవుతూండగా, వృద్ధుడు పింగళుడి భుజాన్ని ఆప్యాయంగా తడుతూ,

"అవంతీనగరపు జాలరివైన నువ్వు, విధి ప్రేరణవల్ల, పద్మపాదుడికి తటస్థపడి—మహత్కార్యాన్ని సాధించావు. ఇందుకు నేను నిన్ను అభినందిస్తున్నాను," అన్నాడు.



పింగళుడు వారం రోజులపాటు పద్మపాదుడికి అతిథిగా వుండి తిరుగు ప్రయాణానికి సిద్ధమయాడు. పద్మపాదుడు అతడికి విలువైన దుస్తులతోపాటు, చాలా బంగారమూ, రత్నాలూ, మణులూ బహూకరించాడు. పింగళుడు వాటినన్నిటినీ కృతజ్ఞత కనబరుస్తూ స్వీకరించాడు.

తీరా పింగళుడు యింటి ప్రాకారపు ద్వారాలు దాటి బయటికి వచ్చిం తరవాత, పద్మపాదుడు అతడికి, మహామాయుడి సమాధి నుంచి తెచ్చిన వస్తువులన్నీ చూపెడుతూ, "పింగళా! వీటిలో నీకు కావాలన్న ఏ ఒకటైనా సంతోషంగా యిచ్చివేస్తాను, తీసుకో!" అన్నాడు.

పింగళుడు అందుకు అంగీకరించలేదు. అతడు చిరునవ్వు నవ్వుతూ, "పద్మపాదా! ఆ మహాశక్తి సంపన్నమైన వస్తువులు. జాలరినైన నా దగ్గిరకన్న, మంత్రవేత్తవయిన నీ దగ్గిరే ఎంతో రాణిస్తవి. మరోలా అనుకోకపోతే, నేను కోరదలిచిన వస్తువు నీ దగ్గిర ఒకటి వున్నది," అన్నాడు.

"ఏమిటదీ? నిరభ్యంతరంగా కోరుకో, యిచ్చేస్తాను!" అన్నాడు పద్మపాదుడు.

"నీ దగ్గిర మహత్తు గల సంచీ ఒకటి వున్నది గదా? వంటచేసే బాధ లేకుండా సకల పదార్థాలూ అందులో దొరుకుతవి! అది నా దగ్గిర వుంటే వృద్ధురాలైన నా తల్లికి రోజూ వంటచేయవలసిన బాధతప్పి, ఎంతో సంతోషిస్తుంది," అన్నాడు పింగళుడు.

పద్మపాదుడు, పింగళుడు కోరిన విధంగా ఆ సంచిని ఇచ్చేశాడు. తరవాత పింగళుడు వృద్ధ మంత్రవేత్తకూ, పద్మపాదుడికీ వీడ్కోలు చెప్పి, భల్లూకకేతుడి భుజాల మీద కూర్చుని ఆకాశమార్గాన బయలుదేరాడు.

భల్లూకకేతుడు దట్టంగా మేఘాలతో కప్పబడిన ఆకాశమార్గాన ఎగురుతూ, సరిగా మిట్టమధ్యాహ్నం వేళకు అవంతీ నగర పరిసరాలకు చేరాడు. పింగళుడు, ఆ నగరాన్నీ, ఆ నగరం పొలిమేరలలో వున్న తన పూరిగుడిసెనూ చూస్తూనే, ఉలిక్కిపడి భల్లూకకేతుడి భుజం తట్టి, "భల్లూకా! నువ్వు యిక ముందుకు సాగకుండా, ఆ దిగువ కనిపిస్తున్న చెట్ల మధ్యకు దిగు!" అన్నాడు ఆదుర్దాగా.

భల్లూకకేతుడు, పింగళుడు కోరిన విధంగా, అవంతీనగర పొలిమేరలలో వున్న ఒకానొక చెట్లగుంపు మధ్య దిగాడు. పింగళుడు అతడి భుజం మీంచి దిగి "భల్లూకా! నిన్ను యీ రూపంలో నగరంలోకి తీసుకుపోవటం, అనేక చిక్కులకు కారణం కాగలదు. యిప్పుడేం దారి?" అన్నాడు నిస్పృహగా.

పింగళుడి భయానికి కారణం ఏమిటో గ్రహించిన భల్లూకకేతుడు పెద్దగా నవ్వి, "ప్రభో! అయితే మీరు ఒంటరిగానే నగరంలోకి వెళ్ళండి. నా సహాయం కావలసివచ్చినప్పుడు యీ మంత్రం పఠించండి! వెంటనే నేను మీ సాన్నిధ్యంలో వుంటాను," అంటూ ఏదో మంత్రం పింగళుడి చెవిలో చెప్పి, అదృశ్యుడయాడు.

పింగళుడు, పద్మపాదుడు యిచ్చిన ధనరాసుల్ని మోసుకుంటూ తన యింటి వైపుకు నడిచాడు. అతడు కొంతసేపటికి యింటిని సమీపించేసరికి, చిక్కి శల్యమైపోయిన స్థితిలో వున్న అతడి తల్లి, వాకిట్లో కూర్చుని నీరసపడిన గొంతుతో, "అయ్యా! ధర్మదాతలు, యీ ముసలిదానికి ఏమైనా ధర్మం చెయ్యండి. ఆకటితో అలమటిస్తున్నాను!" అంటూ దీనాతిదీనంగా చేతులు చాచటం అతడి కంటబడింది.

పింగళుడు ఆ దృశ్యాన్ని చూస్తూనే నిలువెల్లా వణికిపోయి, వచ్చే దుఃఖాన్ని ఆపుకుంటూ, "అమ్మా! నీకు యీ దుస్థితి ఎలా కలిగింది!" అంటూ తల్లికేసి పరిగెత్తాడు. —(ఇంకా వుంది)






# పద్మనాభుడి పెళ్ళి

పట్టువదలని విక్రమార్కుడు చెట్టువద్దకు తిరిగి వెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, చేపట్టిన కార్యం ఎన్ని కష్టాలకైనా ఓర్చి సాధించాలనే, నీ పట్టుదల మెచ్చదగిందే! కాని, దుస్సాధ్యమైన దీనికి నిన్ను పురిగొల్పినవాడు, బహుశా నీ పట్ల మిత్రత్వం నటించే శత్రువై వుంటాడన్న అనుమానం నాకు కలుగుతున్నది. కేవలం ధైర్య సాహసాలూ, తెలివితేటలూ గల వాళ్ళు సాధించలేని కొన్ని కార్యాలు, అమాయకులూ, సద్బుద్ధిగలవాళ్ళూ సునాయాసంగా సాధించగలరు. ఇందుకు ఉదాహరణగా నీకు, పద్మనాభు డనేవాడి కథ చెబుతాను, శ్రమతెలియకుండా విను," అంటూ యిలా చెప్పసాగాడు:

## బేతాళ కథలు



కుముదవతి నగరంలో పద్మనాభుడనే యువకుడుండేవాడు. వాడు మంచి అందగాడు. కాని, ఒట్టి అమాయకుడు. వాడికి నా అన్నవాళ్ళెవరూ లేరు.

ఒకనాడు వాడు నగర వీధులగుండా పోతూండగా రత్నభద్రుడి కుమార్తె సులక్షణ పల్లకిలో పోతూ కనిపించింది. ఆమె అద్భుత సౌందర్యానికి పద్మనాభుడి కళ్ళు చెదిరిపోయాయి. ఆ క్షణంలోనే వాడు, సులక్షణను తప్పక పెళ్ళాడి తీరాలని నిశ్చయించుకున్నాడు.

రత్నభద్రుడు కుముదవతి నగరంలోని ప్రముఖ వర్తకుల్లో ఒకడు; కోట్లకు పడగలెత్తినవాడు. అలాంటి ధనికుడి కుమార్తెను పెళ్ళాడడం, పద్మనాభుడి లాంటి పేదవాడికి ఏ విధంగానూ సాధ్యపడే పని కాదు. కాని, అతడు అమాయకత్వం కొద్దీ, యిదేమీ ఆలోచించలేకపోయాడు.

ఆ సాయంత్రమే వాడు, తన మిత్రుడు రవివర్మతో సులక్షణను గురించి చెప్పాడు. రవివర్మకు పద్మనాభుడి మీద ద్వేషభావం వున్నది. దానికి కారణం, అందరూ అతణ్ణి అందగాడని మెచ్చుకోవడమే. రవివర్మ తన ద్వేషాన్ని ఏనాడూ బయటికి పొక్కనీయలేదు. సమయం చూసి పద్మనాభుణ్ణి నవ్వులపాలు చేయాలని అతడి ఎత్తుగడ.

పద్మనాభుడు, సులక్షణ అందాన్ని వర్ణించి, తానామెను పెళ్ళాడదలచినట్టు చెప్పగానే, రవివర్మ, "అదెంతపని, పద్మనాభా! నీ లాంటి అందగాడు అల్లుడు కాబోతున్నాడని తెలిస్తే, రత్నభద్రుడు ఎగిరిగంతేస్తాడు. వెళ్ళి అడుగు." అని సలహా యిచ్చాడు.

అమాయకుడైన పద్మనాభుడు నిజంగానే రత్నభద్రుడి దగ్గిరకు పోయి, "మీకు అభ్యంతరం లేకపోతే, సులక్షణను వివాహం ఆడదలిచాను," అన్నాడు.

రత్నభద్రుడు చాలా పెద్ద మనిషి, నెమ్మదస్థుడు. ఆయన పద్మనాభుడు

అమాయకుడని గ్రహించి, "నీకు, నా కుమార్తె నిచ్చి తప్పక వివాహం చేస్తాను. కాని, అందుకు నాకు, నువ్వొక మణుగు బంగారం యివ్వవలసి వుంటుంది," అన్నాడు.



పద్మనాభుడు అంత బంగారం తేలేడని రత్నభద్రుడికి బాగా తెలుసు. అయితే, పద్మనాభుడు అంతటితో ఊరుకోక, సంగతి చెప్పి, రవివర్మ సలహా అడిగాడు.

"దానిదేముంది! వెళ్ళి, వడ్డీ వ్యాపారి సోమనాధుణ్ణి అప్పు అడుగు. నీవంటి అందగాడికి అతను తప్పక అప్పిస్తాడు!" అన్నాడు రవివర్మ.

పద్మనాభుడు, సోమనాధుణ్ణి చూడబోయి, "ఒక మణుగు బంగారం అప్పుగా యివ్వండి," అని అడిగాడు.

సోమనాధుడికి, పద్మనాభుణ్ణి ఆటపట్టించి వినోదించాలనిపించింది. ఆ కారణంగా అతను, పద్మనాభుడితో "నీ అంతటివాడికి నేను అప్పులు యివ్వడం ఏమిటి! ఆ కనబడే నది ఒడ్డున చెట్టు కింద భైరవబైరాగి అనే అతనున్నాడు. అతడికి ఇనుమూ, ఇత్తడీ లాంటి వాటిని బంగారంగా మార్చే, పరసువేది విద్య తెలుసు. వెళ్ళి అడిగావంటే, నీకు ఉచితంగా మణుగు బంగారం యిస్తాడు," అన్నాడు.

బంగారం ఉచితంగా లభిస్తుందన్న మాట విని, పద్మనాభుడు చాలా ఆనందపడుతూ, బైరాగి దగ్గరకుపోయి, "ఒక మణుగు బంగారం ఉచితంగా యిప్పించండి!" అన్నాడు.

ఈ బైరాగి పెద్ద మోసగాడు. పరసువేదివిద్య నేర్పుతానని, అమాయకుల నుంచి చాలా డబ్బు గుంజాడు. వాడలా కూడబెట్టిన డబ్బును, గౌరముఖుడు అనే గజదొంగ దొంగిలించుకుపోయాడు. బైరాగి ఆ గజదొంగను పట్టాలనే ఆలోచనలో వున్నాడు.

"పద్మనాభా! నువ్వు అందగాడివే కాదు, తెలివైనవాడివీ, ధైర్యవంతుడివీలా



కనిపిస్తున్నావు. ఒక పని చెయ్యి! నగర పరిసరాల్లో అడవిలో, గౌరముఖుడు అనే గజదొంగ వున్నాడు. వాణ్ణి పట్టి, నా దగ్గిరకు తీసుకువచ్చావంటే, నీకు మణుగు బంగారం యిస్తాను," అన్నాడు బైరాగి.

పద్మనాభుడు అడవికిపోయి అక్కడా, యిక్కడా వెతికి, ఎలాగయితేనేం గౌరముఖుడు వున్న ప్రదేశం చేరాడు. గజదొంగ, పద్మనాభుణ్ణి ఆదరంగా చూసి, "ఏం, నా ముఠాలో చేరాలని వచ్చావా?" అని అడిగాడు.

"అదేం కాదు. భైరవబైరాగి నిన్ను తన దగ్గిరకు తీసుకువస్తే, నాకు ఉచితంగా మణుగు బంగారం యిస్తానన్నాడు. దయచేసి, నాతో రా!" అన్నాడు పద్మనాభుడు దీనంగా.

గౌరముఖుడికి, పద్మనాభుడు పరమ అమాయకుడని అర్థమైంది. వాడు అతడి ఆధారంగా చిన్న తమాషా చేయదలిచి, "నీకు మణుగు బంగారం ఏం ఖర్మ, పది మణుగుల బంగారం దొరికే మార్గం చెబుతాను. ఆ కనబడే కొండగుహల్లో, ఒక చోట నల్లభూతం ఒకటున్నది. పోయి దాన్నడిగావంటే, కోరినంత బంగారం యిస్తుంది," అన్నాడు.

ఈ మాట విని పద్మనాభుడు, సులక్షణతో తన పెళ్ళి జరిగిపోయినంతగా ఆనందపడుతూ, గుహల కేసి వెళ్ళాడు. అక్కడ ఒక గుహ ముందు బండరాతి మీద నల్లభూతం కూర్చుని వున్నది.

నిజానికి యీ నల్లభూతం ఎవరికీ హాని కలిగించేదికాదు. కాని, దాని భయంకరమైన రూపం చూసి జనం భయకంపితులై పారిపోయేవారు. కాని, అమాయకుడైన పద్మనాభుడు, అది కనబడగానే సంతోషంగా దగ్గిరకు పోయి, తన కథయావత్తూ చెప్పుకుని, "రత్నభద్రుడి కుమార్తె సులక్షణతో నా పెళ్ళి జరగాలంటే, నువ్వు సాయం చేయక తప్పదు. ఒక్క మణుగు బంగారం యిచ్చావంటే, బతికినన్నాళ్ళూ, నీ మేలు మరవను," అన్నాడు.

అంత నిర్భయంగా, ఒంటరిగా తన దగ్గిరకు• వచ్చిన పద్మనాభుడు ఎంత అమాయకుడో, ఎలాంటి నిర్మల హృదయం కలవాడో నల్లభూతానికి తెలియడంతో, దానికి అతడిపట్ల చాలా ఆదరం కలిగింది.

భూతం లేచి గుహలోకి పోయి, ధగధగ మెరుస్తున్న నాలుగు వజ్రాలు తెచ్చి పద్మనాభుడికి చూపుతూ, "నీకు కావాలంటే మణుగు బంగారం కాదు; లక్షలా కోట్లా విలువచేసే, యీ వజ్రాలు యివ్వగలను. కాని, నువ్వు చెప్పినదంతా విన్న తరవాత, నీకు వీటి అవసరం వుండదని, నా నమ్మకం. నగరానికి తిరిగి వెళ్ళి రత్నభద్రుడికి జరిగినదంతా చెప్పు. అప్పటికీ అతడు ధనం కావాలంటే, వచ్చి యీ వజ్రాలు తీసుకుపో," అన్నది.

పద్మనాభుడు నల్లభూతానికి తన కృతజ్ఞత చెప్పుకుని, నగరానికి వచ్చి, జరిగినదంతా రత్నభద్రుడికి చెప్పాడు.

రత్నభద్రుడు, ఆప్యాయంగా పద్మనాభుడి భుజం మీద చేయివేసి, "నువ్వు, నా అల్లుడు కాదగినవాడివి! సులక్షణతో నీకు వివాహం జరుపుతాను," అన్నాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, "రాజా, రత్నభద్రుడు లాంటి లోకజ్ఞతా, వ్యవహార జ్ఞానం వున్న ప్రముఖవర్తకుడు, పరమ అమాయకుడైన పద్మనాభుడికి తన కుమార్తె నివ్వడం విడ్డూరంగా లేదా? అతడు నల్లభూతం తనకేమైనా హాని



కలిగిస్తుందని యిందుకు ఒప్పుకున్నాడా? పద్మనాభుడు మణుగు బంగారం కాదు, కోట్ల విలువచేసే వజ్రాలు తెచ్చి యివ్వ గలడు కదా? ఆ అవకాశాన్ని అతడు ఎందుకు జారవిడుచుకున్నాడు? ఈ సందేహానికి సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో, నీ తల పగులుతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "నల్లభూతం తనకు హాని కలిగిస్తుందన్న భయం రత్న భద్రుడికి ఏమాత్రం లేదు. కోట్లకు పడగ లెత్తిన అతడికి, నల్లభూతం యిచ్చే ధనం ఒక లెక్కలోనిది కాదు. పద్మనాభుడు చెప్పింది విన్న తరవాత రత్నభద్రుడు, భూతం హాని కాక, తనకు ఎంతో మేలు చేయ చూస్తున్నదని గ్రహించాడు. అది పరోక్షంగా పద్మనాభుడి ద్వారా, అతడికి ఒక జీవితసత్యాన్ని తెలియబరిచింది. అదేమిటంటే—మనిషికున్న ధనంకంటే, అతడిలో వున్న మంచిబుద్ధీ, తలపెట్టిన కార్యం సాధించి తీరాలనే పట్టుదలా, నిజాయితీ ఎక్కువ విలువకలవి. అలాంటి వాళ్ళు జీవితంలో ఏనాటికైనా తప్పక ఉన్నతస్థానానికి చేరగలరు. దుష్టబుద్ధి అయిన పద్మనాభుడి స్నేహితుడూ, బైరాగీ, గజదొంగా ఏదో ఒకనాడు, తమ దుష్కార్యాలకు శిక్ష అనుభవిస్తారు. ఈ సత్యం తెలుసుకున్న రత్నభద్రుడికి, తన కాబోయే అల్లుడి అమాయకత్వం లోపంగా కనిపించలేదు. పోతే, పద్మనాభుడు ఒక సారి తన అల్లుడయాక, వర్తక వ్యాపా రాల్లో అతణ్ణి ప్రవేశపెట్టి, తన శిక్షణలో అతడికి తేలికగా లోకజ్ఞానం కలిగించ వచ్చునన్న నమ్మకం, రత్నభద్రుడికి కలి గింది. బుద్ధిమంతుడైనవాడు లోకజ్ఞాని కావడం ఏమంత కష్టం కాదు. ఇలా ఆలోచించే, రత్నభద్రుడు పద్మనాభుణ్ణి తన అల్లుణ్ణి చేసుకోవాలనుకున్నాడు," అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగ గానే, బేతాళుడు శవంతోసహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. —(కల్పితం)





# చెప్పే పద్ధతి

శచీంద్రు డనే రాజు సంగీతశాస్త్రంలో కొత్తగా కొంత ప్రవేశం సంపాదించి, పది మందికీ తన పాట వినిపించడం ప్రారంభించాడు. ఆయన పాడడం మొదలు పెట్టాక, ఆయన ఆశ్రితులే కాక మంత్రులూ, తదితర రాజోద్యోగులూ కూడా తప్పనిసరిగా, ఆ పాట పూర్తిగా వినవలసి వచ్చేది. ఆ కారణంవల్ల, వాళ్ళు చేయవలసిన పనులు సకాలంలో జరిగేవికావు. రాజుగారికి యీ సంగతి చెప్పడం ఎలా అన్న సమస్య వాళ్ళకు ఎదురయింది.

ఎంత ఆలోచించినా ఎవరికీ. యీ సమస్యకు పరిష్కారమార్గం కనిపించ లేదు. రాజుగారికి సంగతి సూటిగా చెబితే, ఆయనకు తప్పక కోపం వస్తుంది. అప్పుడు ఉద్యోగాలు పొయ్యేమాట అట్లా వుంచి, ప్రాణాలకే ముప్పు కలగవచ్చు.

వసంతకు డనేవాడు, రాజు శచీంద్రుడి విదూషకుడు. అతడికీ, రోజూ రాజుగారి పాట గంటలతరబడి వినడం విసుగ్గానే వుంది. ఒకరోజు ఆయన పాడడం పూర్తయ్యాక విదూషకుడితో, "నా గాత్రంలో ఏదో ఇంద్రజాలం వున్నట్టున్నది. నేను పాడుతున్నంతసేపూ, మీరలా నా చుట్టూ వుండిపోతున్నారంటే, నేనంత గొప్ప గాయకుణ్ణా అన్న అనుమానం కలుగుతున్నది," అన్నాడు.

ఆ మాటలకు విదూషకుడు భయం నటిస్తూ, "ప్రభూ, ఒకసారి తమ గాన సభలోకి అడుగు పెట్టాక, ఎవరికైనా లేచి వెళ్ళడానికి ఎన్ని గుండెలు కావాలి!" అన్నాడు.

విదూషకుడి మాటల్లోని అంతర్యం రాజు వెంటనే గ్రహించాడు. ఆయన కోప గించుకోకపోగా, చిన్నగా నవ్వి, "రోజూ

జొన్నలగడ్డ రత్న

నా పాట వింటూ కూర్చునే వాళ్ళలో కొందరు నా మెప్పుకోలు కోసమయితే, మరికొందరు నా అధికారానికి భయపడి అన్న మాట! ఈ సంగతి, యింతకాలంగా నాకు స్ఫురించనందుకు విచారిస్తున్నాను." అన్నాడు.

''మన్నించండి. ప్రభూ! నా మాటలు తమకు కోపకారణం కాగలవను కున్నాను,'' అన్నాడు విదూషకుడు.

''అలాంటిదేం లేదు; నిన్ను అభినంది స్తున్నాను. కాని, హఠాత్తుగా నేను పాడడం మానివేసినా, ఎవరినీ రావద్దని ఆజ్ఞా పించినా, అందరికీ ఏదో సంశయం కలిగి తీరుతుంది. అలాకాక, ఇంతకాలంగా నా పాటవల్ల మీకు అసౌకర్యం కలిగిం దని చెప్పుకోవడం, నాకు అవమానకరం. ఈ చిక్కు సమస్య నుంచి బయటపడడం ఎలా?'' అన్నాడు.

''ప్రభూ, ప్రతి విషయానికి చెప్పే పద్ధతి అంటూ ఒకటుంటుంది. నేను, నా పద్ధతిలో తమకు చెప్పాలనుకున్నది చెప్పగలిగాను గదా. అలాగే మీరు కూడా, మీ హోదాకు ఏమాత్రం భంగం లేకుం డానే, మీ పాట వినడానికి వచ్చేవాళ్ళను ఆదేశించవచ్చు. ఆలోచించి చూడండి,'' అన్నాడు విదూషకుడు.

మరుసటి రోజున రాజు పాడడం ఆరం భిస్తూనే, అక్కడ చేరిన వాళ్ళకేసి కోపంగా చూస్తూ, ''మీ ధోరణి నాకేం బాగాలేదు. సంగీత సాధనకు కొంత ఏకాంతం అవసరం అన్న స్వల్ప విషయం కూడా మీకు తెలిసినట్టు లేదు. నేను గొంతు ఎత్తేసరికి, చుట్టూ చేరుతున్నారు. ఇకనుంచి మీ పనులు మానుకుని నా సమక్షంలోకి వచ్చారంటే కఠినంగా శిక్షించగలను,'' అని మందలించాడు.

అనుకోని విధంగా రాజుగారి సంగీతం వినే బెడద తప్పినందుకు, రాజోద్యోగు లందరికీ చాలా సంతోషం కలిగింది. కాని, రాజుగారిలో యింత హఠాత్తుగా వచ్చిన మార్పుకు కారణం మాత్రం ఎవరికీ అర్థం కాలేదు.





# పెట్టుబడి ఉచితం

పరంధామయ్య, గ్రామంలో కొద్ది భూవసతి వున్న రైతుల్లో ఒకడు. ఆయన కష్టించి పనిచేసి, దానిమీద వచ్చే ఆదాయంతో నలుగురు కొడుకులను పెంచి పెద్దవాళ్లను చేయడమే కాకుండా, సొంత ఇల్లు కూడా కట్టుకున్నాడు.

ఒంటరిగా కుటుంబ భారమంతా మోయవలసి రావడంతో, ఆయన తండ్రి నుంచి సంక్రమించిన పొలం తప్ప, కొత్తగా ఒక్క కుంట పొలం కూడా కొన లేకపోయాడు. కొడుకులు నలుగురికీ పెళ్ళిళ్ళయి, కోడళ్ళు కాపరానికి రావడంతో, యింత పెద్ద సంసారానికి తిండీ, బట్టా సమకూర్చడం ఎలా అన్న సమస్య ఆయనకు ఎదురయింది. కొడుకులు గ్రామం వదిలి, తమ బతుకు తెరువు తామే చూసుకోగలరని, పరంధామయ్య అనుకున్నాడు. కాని, అలా జరగలేదు.

ఒకనాడు ఆయన పెద్దకొడుకును పిలిచి, ''మనం సేద్యం చేస్తున్న పొలం పెరిగే అవకాశం లేదు; కాని కుటుంబ ఖర్చులు బాగా పెరిగిపోయినై. ఈ ఖర్చులకు సరిపడా ఆదాయం వచ్చే మార్గం ఏమైనా ఆలోచించావా?'' అని అడిగాడు.

దానికి పెద్దకొడుకు, ''మనకున్న చారెడు నేలా, మనకు సరిపడా తిండి గింజలివ్వకపోతే, ఇతర్ల పొలాలు కౌలుకు తీసుకుందాం,'' అన్నాడు.

ఆ జవాబుకు పరంధామయ్య బాధపడుతూ, ''మనం యింతకాలం సొంత వ్యవసాయం చేసుకున్నాం. ఇప్పుడు పొలం కౌలుకు తీసుకుంటే, యిన్నాళ్ళుగా మనను గౌరవించిన వాళ్ళే, మన మీద అధికారం చెలాయిస్తారు,'' అన్నాడు.

తరవాత పరంధామయ్య మిగతా ముగ్గురు కొడుకులు కూడా ఆయనకు

ఎమ్. వి. వి. సత్యనారాయణ



"అయ్యా, నాకు కొంత వెదురుతోట వున్నది. ఎవరైనా వెదురు నరుక్కుని, తోట చదునుచేసి పెడతారేమోనని వచ్చాను," అన్నాడు కోయవాడు.

పెద్దకొడుకులో ఆశ రగిలింది. కావలసినంత వెదురు ఉచితంగా నరుక్కోవచ్చు. పట్నంలో దానికి మంచి ధర పలుకుతుంది. ఎటొచ్చీ అక్కడికి చేర్చేందుకు రవాణా ఖర్చులు మాత్రం అవుతాయి!

ఇలా ఆలోచించి, పెద్దవాడు కోయవాడి వెంట అడవికి వెళ్ళి, వెదురు కొట్టించి, దాన్ని పట్నం చేర్చాడు. వాడు దాన్ని అమ్మబోతున్నంతలో పరంధామయ్య రెండోకొడుకు అక్కడికి వచ్చాడు.

వాడు అన్నతో, "వెదురును అమ్మకు. దాన్ని చీల్పించి యిస్తే, హెచ్చుధర యివ్వడానికి ఒక వర్తకుడు సిద్ధంగా వున్నాడు," అన్నాడు.

అన్నదమ్ములిద్దరూ వెదురును ఈనెలుగా, పల్చటి బద్దలుగా చీల్పించారు. మర్నాడు వర్తకుడు వాటిని తీసుకుపోయేందుకు వచ్చాడు. సరిగ్గా అదే సమయానికి గ్రామం నుంచి పరంధామయ్య మూడో కొడుకు అక్కడికి వచ్చాడు.

వాడు ఎంతో ఆదుర్దాగా, "అన్నలారా, ఇంత చక్కగా చీల్పించిన వెదురును చౌకగా అమ్ముతున్నారు. వీటిని వెదురు

పెద్దవాడి ధోరణిలోనే జవాబులిచ్చారు. చెట్టున రాలిన విత్తనాలు, నాలుగు పక్కలకూ వెళితేనే బలమైన వృక్షాలు అవుతాయి. చెట్టువద్దనే పెరగాలంటే, వాటికి తగినంతగా ఆహారం సమకూర్చుకునే వెసులుబాటు వుండదు!

ఈ వాస్తవం తన కొడుకులు అర్థం చేసుకునేలా చెప్పడం ఎలా? పరంధామయ్య బాగా ఆలోచించి, చివరకు పట్నం వెళ్ళాడు. ఆ మర్నాడే కోయవాడొకడు పరంధామయ్య యింటికి వచ్చాడు. ఆ సమయంలో పెద్దకొడుకు ఇంట్లో వున్నాడు. అతను, వాణ్ణి పలకరించి, ఎవరి కోసం వచ్చావని అడిగాడు.

తడికెలుగా, బుట్టలుగా అల్లి యిప్పించ డానికి, ఒక వర్తకుడు వచ్చాడు. అవి తయారయ్యాక అతనే మంచి ధరకు వాటిని అమ్మిపెడతాడు,'' అన్నాడు.

వెదురు తడికెలా, బుట్టలా అల్లిక మొదలయింది. తీరా వాటిని తీసుకు పోయేందుకు వర్తకుడు వచ్చేసరికి, పరంధామయ్య నాలుగో కొడుకు అక్కడికి వచ్చి, ''వీటిని మనమే అమ్ముకుంటే, ఆ లాభాలు మనకే దక్కుతాయి. ఆ పని నేను చేయగలను,'' అన్నాడు.

అన్నదమ్ములు నలుగురూ కలిసి వాటిని మంచి ధరకు సంతలో అమ్మారు. తరవాత వచ్చిన డబ్బును వాళ్ళు సమంగా పంచుకోబోతున్నంతలో, పరంధామయ్య అక్కడికి వచ్చి, ''మీరు లాభాలు పంచుకునే ముందు, వెదురు ధర ఒకపక్కన పెట్టండి!'' అన్నాడు.

తండ్రి మాటలకు వాళ్లు ఆశ్చర్యపోతూ, ''వెదురు ధర ఏమిటి? అది మనకు ఉచితంగా వచ్చిందిగదా?'' అన్నారు.

పరంధామయ్య నవ్వి, ''కోయవాడు ఉచితంగా యిచ్చిన మాట నిజమే! కాని, మనం మళ్ళీ వెదురు సంపాయించా లంటే, ధర పెట్టి కొనుక్కోవలసిందే గదా?'' అన్నాడు.

నలుగురూ ఒకక్షణం ఆలోచించి అవు నన్నారు. అప్పటికి గడించిన అనుభవంతో వాళ్ళకు వర్తకం ఏమంత కష్ట సాధ్యమైన వృత్తిగా కనిపించలేదు. బాధ్యతలు నలుగురూ పంచుకుని, కొద్ది కాలంలోనే వాళ్ళు వెదురు వర్తకంలో పేరూ, మంచి లాభాలూ సంపాయించ సాగారు.

పరంధామయ్య కొడుకుల నుంచి ఒక రహస్యం దాచాడు. మొట్టమొదట పెద్ద కొడుక్కు వెదురు యిచ్చిన కోయవాడు, ఆయన నుంచి దానికి తగిన ధర తీసు కున్నాడు. తరవాత వర్తకులమంటూ వచ్చి, అన్నదమ్ములకు సలహాలిచ్చిన వాళ్ళు కూడా పరంధామయ్య పట్నం స్నేహితులే.





# దానపాత్రుడు

ఒకప్పుడు బోధిసత్వుడు కాశీ రాజుగా జన్మించాడు. ఆయన పరిపాలించే కాలంలో సరిహద్దున కొందరు పితూరీ జరిపారు. పితూరీదార్లను అణచే నిమిత్తమై రాజుగారు కొంత బలాన్ని వెంటబెట్టుకుని సరిహద్దు ప్రాంతానికి కదిలి వెళ్ళాడు. అక్కడ యుద్ధం జరిగింది. ఆ యుద్ధంలో రాజుకు గాయం తగిలింది. ఆయన ఎక్కి ఉన్న గుర్రం కాస్త బెదిరిపోయి, ఆయనతోపాటు యుద్ధరంగం నుంచి పారిపోయింది.

కొద్దిసేపట్లో రాజు గుర్రంతోసహా ఒక సరిహద్దు గ్రామంలోని రచ్చపట్టును చేరుకున్నాడు. ఆ సమయంలో అక్కడ గ్రామంలోని ముప్ఫై గడపలవారూ చేరి గ్రామ వ్యవహారాలు మాట్లాడుకుంటున్నారు. కత్తీ, డాలూ, కవచమూ ధరించి, యోధుడి వేషంలో రాజు అక్కడ ప్రత్యక్షమయేసరికి, రచ్చపట్టులో చేరినవారంతా భయపడి చెల్లాచెదురుగా పారిపోయారు. ఒక్క గ్రామస్థుడు మాత్రం అక్కడినుంచి కదలలేదు.

ఆ గ్రామస్థుడు రాజును సమీపించి, "నీవు పితూరీదారువా ? రాజు పక్షం వాడివా ?" అని అడిగాడు.

"అయ్యా, నేను రాజుపక్షమే !" అని రాజు జవాబు చెప్పాడు.

ఈ మాట విని గ్రామస్థుడు తృప్తి పడ్డట్టు కనబడి, "అయితే, మా యింటికి పోదాం, రా!" అని రాజును తన అతిథిగా తీసుకుపోయి, తన భార్యచేత ఆయన కాళ్ళు కడిగించి, భోజనం పెట్టించి, అతిథి మర్యాదలన్నీ చేయించాడు. తరవాత రాజు ఎక్కి వచ్చిన గుర్రానికి ఆ గ్రామస్థుడు తానే స్వయంగా నీరు పెట్టి, దాణా వేశాడు.

రాజు ఆ గ్రామస్థుడి ఇంట నాలుగు రోజులు అతిథిగా ఉండి తనకు కలిగిన గాయాలను మాన్పుకున్నాడు. ఈ లోపలే ఆయన సైనికులు పితూరీని అణచి వేయడం జరిగింది.



రాజు కాశీ నగరానికి తిరిగి వెళ్ళి పోతూ, గ్రామస్థుడికి తన కృతజ్ఞత తెలుపు కుని, "అయ్యా, నేను కాశీనగరవాసిని, మా ఇల్లు కోట ఆవరణలోనే ఉన్నది. నా కొక భార్య, ఇద్దరు కుమారులూ ఉన్నారు. మీరు కాశీ నగరానికి వచ్చి కుడిచేతి వైపున ఉండే ఉత్తర ద్వారం దగ్గిర కాపలావాణ్ణి, 'మహాశ్వారోహుడి ఇల్లెక్కడ?' అని అడిగితే, వాడు మిమ్మల్ని మా ఇంటికి తెస్తాడు. మీరు మీ చిత్తం వచ్చినంతకాలం మా ఇంట అతిథిగా ఉండవచ్చు!" అని చెప్పాడు.

తరవాత రాజు తన బలాలను చేరు కుని, కాశీనగరానికి తిరిగి వెళ్ళిపోయాడు. ఆయన ఉత్తర ద్వారపాలకుణ్ణి పిలిపించి, వాడితో రహస్యంగా, "ఒరే, ఎవరన్నా నీ వద్దకు వచ్చి, 'మహాశ్వారోహుడి ఇల్లెక్కడ?' అని అడిగితే ఆ మనిషిని సగౌరవంగా నా దగ్గిరికి తీసుకురా!" అని చెప్పాడు.

ఆ గ్రామస్థుడు వస్తాడని రాజు ఎంతో కాలం ఎదురు చూశాడు. కాని అతను రానేలేదు. అతన్ని ఏ విధంగానైనా రప్పిం చాలనే ఉద్దేశంతో, రాజు తన మంత్రు లతో చెప్పి ఆ సరిహద్దు గ్రామం మీద కొత్త పన్నులు వేయించాడు.

అప్పటికీ గ్రామస్థుడు రాజు వద్దకు రాలేదు. మరి కొంతకాలం చూసి రాజు ఆ గ్రామం మీద మరొక కొత్త పన్ను వేయించాడు. ఈ విధంగా రెండు మూడు సార్లు జరిగాక, ఆ గ్రామంలో ఉండే మిగిలిన వాళ్ళు గ్రామస్థుడి దగ్గిరికి పోయి, "ఈ పన్నులతో చచ్చిపోతున్నాం. కాశీనగరంలో ఎవరో నీ మిత్రుడున్నాడని చెప్పావు గదా, నీవు వెళ్ళి ఆయనను చూసి, పన్నులు యిచ్చుకోలేక మనం

అందరం నానా అగచాట్లూ పడి పోతున్నా మని మొరపెట్టి, వీటిని తీసివేయించ లేవా ?'' అన్నారు.

''నా స్నేహితుణ్ణి చూడటం కష్టం కాదు. కాని ఆయన దగ్గిరికి వట్టి చేతులతో ఎలా వెళ్ళేది ? ఆయనకొక భార్య ఉన్న దిట, ఇద్దరు కొడుకులున్నారుట. అందరికీ బట్టలు తీసుకుపోవద్దా? ఆయన భార్యకు కానుకగా నగా నట్రా తీసుకుపోవద్దా ? వాటన్నిటినీ త్వరలో సిద్ధం చెయ్యండి, అలాగే బయలుదేరి వెళతాను." అన్నాడు గ్రామస్థుడు.

మిగిలినవాళ్ళు బట్టలూ, నగలూ సమ కూర్చారు. అవి గ్రామస్థులకు పనికివచ్చే ముతక వస్త్రాలూ, మోటు నగలూనూ. గ్రామస్థుడు తన భార్యచేత రొట్టెలూ, పిండివంటలూ తయారు చేయించాడు. తాను తీసుకుపోయే వస్తువులన్నీ ఒక మూట కట్టి వెంట తీసుకుని బయలు దేరాడు.

కొంతకాలానికి అతను కాశీ నగరపు కోట చేరి, కుడివైపున ఉండే ఉత్తర ద్వారం సమీపించి, అక్కడి ద్వారపాల కుణ్ణి, ''బాబూ, నేను మహాశ్వారోహు డింటికి వెళ్ళాలి. దారి ఎటు ?'' అని అడిగాడు.

తక్షణమే ద్వారపాలకుడు గ్రామస్థుణ్ణి తన వెంట పెట్టుకుని రాజుగారి అంతః పురానికి తీసుకుపోయి రాజుగారి ఎదట పెట్టాడు.



అతన్ని చూసి రాజుకు పరమానంద మయింది. గ్రామస్థుడు తనకోసం తెచ్చిన తినుబండారాలను అయన తన భార్య చేతా, కుమారుల చేతా, తన మంత్రి సామంతులచేతా తినిపించి, తాను కూడా తిన్నాడు. అతను తెచ్చిన ముతకబట్టలను తన భార్యా బిడ్డలచేత కట్టించి, తాను కూడా కట్టుకున్నాడు. తరవాత ఆయన తన అతిథికి మేలైన పట్టుబట్టలు కట్ట బెట్టి, తన పాకశాలలో తయారైన భోజనమే అతనికి పెట్టించాడు. తన గ్రామం మీద వేసిన పన్నులు తీయించటానికి అతను వచ్చాడని తెలిసి, రాజుగారు ఆ పన్నులను రద్దు చెయ్యవలసిందిగా మంత్రులకు ఉత్తరు విచ్చాడు.

తరవాత రాజు సభ చేశాడు. ఆ సభలో మంత్రి సామంతులందరి సమక్షాన రాజు ఆ గ్రామస్థుణ్ణి తన అర్ధ రాజ్యానికి రాజుగా ప్రకటించాడు.

ఈ గ్రామస్థుడు వచ్చిన క్షణంనుంచి రాజుగారు అతనిపట్ల చూపుతూ వచ్చిన ఆదరం మంత్రులు మొదలైన వారికి కొంచెం కూడా నచ్చలేదు. అతడికి అర్ధ రాజ్యం పట్టం కట్టడం వారి దృష్టిలో చాలా అవివేకంగా కనిపించింది.

కాని రాజుగారికి ఎదురు చెప్పటానికి వారికి సాహసం లేకపోయింది. అందుకని వారు రాజకుమారుణ్ణి చేరదీసి, ''నాయనా, మహారాజుగారు నీకు చాలా అన్యాయం చేస్తున్నారు. నీకు చెందవలసిన రాజ్యంలో



సగం భాగం నిష్కారణంగా ఈ అనాగరికుడికి కట్టబెడుతున్నారు. ఇందుకు గాను మహారాజుగారి దగ్గిర ఆక్షేపణ తెలుపుకోవలసినవాడవు నీవే!'' అంటూ ఆ కుర్రవాడికి బాగా బోధించి పంపారు.

రాజకుమారుడు తండ్రి దగ్గిరికి వెళ్ళి, వాళ్ళు చెప్పినట్టే తన ఆక్షేపణ తెలిపాడు.

అంతా విని రాజు, ''నాయనా, ఇది నీకు కలిగిన ఆలోచన కాదు. నన్నిప్పుడడిగిన ప్రశ్న సభలో అడుగు. అప్పుడు నీకు నేను తగు విధంగా సమాధానం చెబుతాను!'' అన్నాడు.

రాజకుమారుడు ఆ ప్రకారమే నిండు సభలో తండ్రిని, ''ఈ గ్రామస్థుడికి మీరు అర్ధరాజ్యం ఇవ్వటానికి కారణమేమిటి?'' అని అడిగాడు.

వెంటనే రాజు, ''కుమారా, ఈ గ్రామస్థుడు ఒకప్పుడు నాకు ప్రాణదానం చేశాడు. ఆ సంగతి నీకు తెలియదు,'' అంటూ సరిహద్దున పితూరీ జరిగిన సమయంలో గ్రామస్థుడు బాగా గాయపడిన తనను కాపాడిన వృత్తాంతమంతా వివరంగా చెప్పాడు. ఆ తరవాత ఆయన ఇంకా ఇలా అన్నాడు :

''అపాత్రుడికి దానం చెయ్యటం ఎంత తప్పో, పాత్రుడికి దానం చెయ్యకపోవటం కూడా అంత తప్పే. నేను రాజునని ఎరగకుండానే ఈ గ్రామస్థుడు నాపట్ల విశ్వాసం చూపాడు. నేను రమ్మని ఆహ్వానించినప్పటికీ, ప్రత్యుపకారం పొందే ఉద్దేశం ఏమాత్రమూలేని కారణంచేత, అతను రానే లేదు. చివరకు గ్రామక్షేమం కోరి మాత్రమే బయలుదేరి వచ్చాడు. నా అర్ధ రాజ్యానికి ఇంతకంటె అర్హుడెవరు?''

ఈ మాటలు విని మంత్రి సామంతులందరూ సిగ్గుపడ్డారు. రాజకుమారుడు తను చేసిన పొరపాటు గ్రహించాడు. అతడికి తండ్రి మాటలు చాలా సంతోషం కలిగించాయి. ఆనాటినుండి రాజు తన జీవితాంతం వరకూ ఆ గ్రామస్థుణ్ణి ఎంతో ఆదరంతో చూశాడు.





# మొగల్ సామ్రాజ్య పతనం

మహారాష్ట్రులను అణచే ప్రయత్నంలో, ఔరంగజేబు ఇరవై ఆరేళ్ళు దక్కనులో గడిపాడు. ఆ కారణంగా పరిపాలనా వ్యవహారాలు దెబ్బతిన్నాయి. అతని కొడుకు అక్బర్ పర్షియాకు పారిపోయాడు. పరిస్థితులను చూసి విషాదం చెందిన ఔరంగజేబు 1707వ సంవత్సరంలో అహ్మద్‌నగర్‌లో మరణించాడు.

అతని కొడుకుల మధ్య వున్న విరోధం రక్తపాతానికి దారితీసింది. పెద్ద కొడుకు ఇద్దరు తమ్ముళ్ళను చంపి, బహదూర్ షా పేరుతో సింహాసనం ఆక్రమించాడు. 1712వ సంవత్సరంలో అతడు మరణించిన తరవాత అతని పెద్ద కొడుకు జహందర్ షా తన ముగ్గురు తమ్ముళ్ళను చంపి, తనను రాజుగా ప్రకటించుకున్నాడు.





ఒక సంవత్సరం తిరిగే లోపల, అతని మేనల్లుడు అతణ్ణి చంపి, సింహాసనాన్ని ఆక్రమించాడు. ఆ తరవాత దుర్మార్గులుగా పేరుపడ్డ సయ్యద్ సోదరులు, అధికారాన్ని హస్తగతం చేసుకుని— తమ ఇష్టానుసారం ఒకరి తర్వాత ఒకరుగా ముగ్గురు పాలకులను సింహాసనంపై కూర్చోబెట్టి చంపించారు!



అఖరికి మహమ్మద్ షా సింహాసనం అధిష్ఠించి, సయ్యద్ సోదరులను హత మార్చాడు. అయినా అప్పటికే, ఢిల్లీలో ఏర్పడిన అశాంతి గురించీ, అస్తవ్యస్త పరిస్థితి గురించీ విన్న పర్షియాపాలకుడు నాదిర్ షా, పెద్ద సైన్యంతో ఢిల్లీని ఆక్రమించడానికి భారతదేశం మీదికి దండెత్తాడు.

నాదిర్ షాను ఎదుర్కొనే సైనికబలం గానీ, ధైర్యంగానీ మహమ్మద్ షాకు లేదు. పైగా రాజపుత్రుల సహాయాన్ని కూడా అతడు కోరలేదు. అందువల్ల, నాదిర్ షా సునాయాసంగా ఢిల్లీని పట్టు కున్నాడు. ఇక చేసేది లేక నాదిర్ షాకు సగౌరవంగా స్వాగతం పలికాడు మహమ్మద్ షా.





నాదిర్ షా ఢిల్లీలో సుఖభోగాలు అను భవిస్తూ వుంటే, ఆయన సైనికులు నగరాన్ని కొల్లగొట్ట సాగారు. నాదిర్ షా మరణించాడన్న వదంతి బయలుదేర గానే, ఢిల్లీనగర పౌరులు పట్టరాని ఆనందంతో, పర్షియా సైనికులపై ఎదురు తిరిగి కొందరిని చంపారు.

ఈ వార్త నాదిర్ షా చెవిని పడగానే, అతడు తన సైనికులను ఢిల్లీపౌరుల మీదికి రెచ్చగొట్టాడు. వాళ్ళు విజృంభించి, ఇళ్ళనూ, అంగళ్ళనూ దోచుకుని నాశనం చేశారు. పిల్లలు, పెద్దలు, ఆడా, మగా అన్న తేడా లేకుండా, ఒక్క రోజులో ముప్పైవేలమందిని హతమార్చారు.





పర్షియా సైనికులు భవనాలకు నిప్పంటించారు. అందమైన కట్టడాలు అగ్నికి అహుతయ్యాయి. కనబడిన ప్రతి ఒక్కరినీ హత్య చేశారు. బ్రహ్మాండమైన ఢిల్లీనగరం దయ్యాల నగరంగా కనబడసాగింది.

అపరిమితమైన ధనమూ, బంగారం, విలువైన మణులూ, రత్నాలూ మాత్రమే కాకుండా, జగత్ ప్రసిద్ధమైన మయూర సింహాసనాన్ని కూడా తన వెంట తరలించుకుపోయాడు నాదిర్ షా. వీటితోపాటు వెయ్యి ఏనుగులనూ, ఏడు వేల గుర్రాలనూ, పదివేల ఒంటెలనూ, వివిధ వృత్తులలో నిపుణులైన పలువురు పనివాళ్ళనూ, నాదిర్ షా పర్షియాకు తరలించాడు.





సుప్రసిద్ధమైన కోహినూర్ వజ్రం కోసం, నాదిర్ షా మొగల్ రాజభవనమంతా వెదకసాగాడు. ఆ అమూల్య వజ్రాన్ని, మహమ్మద్ షా తన తలపాగాలో దాచి వున్నట్టు, ఒక మొగల్ అధికారి నాదిర్ షాకు రహస్యంగా తెలియజేశాడట!

రహస్యం తెలుసుకున్న నాదిర్ షా మహమ్మద్ షాతో, "మిత్రమా! మన మైత్రికి చిహ్నంగా మన తలపాగాలను మార్చుకుందామా?" అంటూ తన తలపాగా తీసి మహమ్మద్ షా చేతికిచ్చి, మహమ్మద్ షా తలపాగాను తనే స్వయంగా తీసి తాను ధరించాడు. ఆ విధంగా కోహినూర్ వజ్రం అతడి హస్తగతమయింది!





ఢిల్లీనగరాన్ని రక్తపాతంలో ముంచి, బీభత్సంగా మార్చిన నాదిర్ షా మొగల్ పరిపాలనపై చావుదెబ్బ కొట్టి వెళ్ళాడు. ఆ సమయంలోనే, ఫ్రెంచి, ఇంగ్లీషు వర్తకులు, భారతదేశంలోని సిరిసంపదలచే ఆకర్షింపబడి క్రమంగా రాసాగారు.

# చెవిటితనమే నయం!

ఒక ఊళ్ళో పుట్టుచెవిటివాడైన షావుకారొకడుండేవాడు. అయన చదవడం, రాయడం నేర్చుకున్నాడు. వడ్డీవ్యాపారం చేసి చాలా ఆస్తిపాస్తులు గడించాడు.

అ ఊరుకు ఒకసారి సన్యాసి ఒకడు వచ్చాడు. అతడు చిట్కా వైద్యంలో మహా మటికుడు. ఎందరికో దీర్ఘ కాలంగా వున్న వ్యాధులను భస్మాలతో, రసాయనాలతో నయం చేశాడు. షావుకారుకు యీ సంగతి తెలిసి, తన చెవిటితనానికి వైద్యం చేయించుకోవాలనిపించింది. ఆయన సన్యాసి దగ్గిరకు వెళ్ళి, తన పరిస్థితి కాయితం మీద రాసి చెప్పుకున్నాడు.

"చెవిటితనంవల్ల, నీకొచ్చిన నష్టం ఏమీలేదు. వడ్డీవ్యాపారంలో బాగానే సంపాయిస్తున్నావు గదా? దాని సంగతి మరిచిపో," అని సన్యాసి సలహా యిచ్చాడు.

షావుకారు అందుకు ఒప్పుకోలేదు. తన దగ్గిరకు డబ్బు కోసం వచ్చేవాళ్ళు కొందరు కోపంగా ఏదో మాట్లాడతారనీ, మరికొందరు తనకేసి అయిష్టంగా చూస్తారనీ షావుకారు సన్యాసికి చెప్పి, "అయ్యా, వాళ్ళనేదేమిటో, వినాలని వున్నది," అన్నాడు.

చిట్కా సన్యాసి అయనకు ఏదో ద్రావకం యిస్తూ, "ఇది వనమూలికలతో చేసిన కర్ణామృతం. దీనిని వాడితే, ఒక్క నెలరోజులపాటు, నీకు వినే శక్తి వస్తుంది. ఈ లోపల దీనికి విరుగుడు కావాలంటే మాత్రం యివ్వలేను," అన్నాడు.

షావుకారు ఆనాటి సాయంకాలమే సన్యాసి దగ్గిరకు తిరిగి వచ్చి, "మీ కర్ణామృతం అమోఘంగా పనిచేసింది. కాని, నా దగ్గిరకు వడ్డీడబ్బు కోసం వచ్చేవాళ్ళు, నేనింకా చెవిటివాడినే అనుకుంటున్నారు. వాళ్ళనే మాటలు భరించలేను. చెవిటితనమే నయం! మందు ప్రభావం నెలరోజులన్నారు గదా? ఈ నెలా తమ సన్నిధిలోనే కాలం గడపనివ్వండి," అని దీనంగా వేడుకున్నాడు.

సన్యాసి చిన్నగా నవ్వి, షావుకారును నెలరోజులపాటు తన దగ్గిర వుండనిచ్చాడు.

—ఎం. డి. సౌజన్య





# సూక్ష్మగ్రాహి

పురందర నగరంలో వుండే చంద్రనాగుడు తూర్పు సముద్రంలోని దీవులతో ఓడ వర్తకం చేస్తూండేవాడు. అతడికి వర్తకపు సరుకుల ఎగుమతీ, దిగుమతీ పనుల్లో సాయపడేందుకు సమర్థుడైన మనిషి అవసరం కనబడింది. ఈ సంగతి తెలిసిన తోటివర్తకుడొకడు, చంద్రనాగుడి దగ్గిరకు విశాఖుడు, ఆనందుడు అనే యిద్దరు యువకులను పంపుతూ, నచ్చిన వారిని పనిలో పెట్టుకోవలసిందిగా తెలియబరిచాడు.

చంద్రనాగుడు ఆ యిద్దరిలో ముందుగా ఆనందుణ్ణి, ఓడరేవు వద్దవున్న తన గోదాముకు తీసుకుపోయాడు. అక్కడ చాలా చెక్క పెట్టెలు చెల్లాచెదురుగా పడివున్నవి.

ఆనందుడికి ఆ పెట్టెలను చూపించి, చంద్రనాగుడు, ''ఈ పెట్టెలనిండా వెండీ, యితర లోహాలతో చేసిన వస్తువులున్నవి. వీటిని నేను చంద్రపురం వర్తకుడి వద్ద కొన్నాను. త్వరలో ఓడల మీద తూర్పు దీవులకు పంపవలసివుంది. ప్రస్తుతానికి వీటిని మన గోదాములో సర్దిపెట్టించు,'' అన్నాడు.

తరవాత ఆయన కొంచెం దూరంగా వున్న నలుగురు మనుషులను పిలిచి, ఆనందుడితో, ''వీళ్ళు చంద్రపురం వర్తకుడి మనుషులు. వీళ్ళే యీ పెట్టెలను యిక్కడికి తెచ్చారు. గోదాములో మన మనిషి వున్నాడు. వీళ్ళు పెట్టెలను అక్కడకు తెస్తారు. మన మనిషి వాటిని ఒక క్రమపద్ధతిలో సర్దిపెడతాడు. నువ్వు మాత్రం దగ్గిర వుండి, మొత్తం ఎన్ని పెట్టెలో జాగ్రత్తగా లెక్క రాసి తీసుకురా,'' అని అక్కడినుంచి వెళ్ళిపోయాడు.

రాంబాబు

ఆనందుడు అలాగేనని గోదాములోకి వెళ్ళాడు. బయటనుంచి నలుగురు మనుషులు, ఆయాసపడుతూ తెచ్చిన పెట్టెలను, లోపలవున్న చంద్రనాగుడి మనిషి సునాయాసంగా ఎత్తి, ఒకదానిపై ఒకటి పేర్చసాగాడు.

ఆనందుడు ఆ పెట్టెలను లెక్క పెడుతూ నిలబడ్డాడు.

పని పూర్తికాగానే ఆనందుడు, చంద్ర నాగుడి వద్దకు పోయి, పెట్టెలన్నింటినీ గోదాములో పెట్టించినట్టు చెప్పి, అవి మొత్తం నూటపది అని తెలియజేశాడు.

చంద్రనాగుడు అతడికి తాను పని యివ్వదలిస్తే; మనిషిచేత కబురు చేస్తానని చెప్పి, పంపివేశాడు.

మరసటి రోజు చంద్రనాగుడు ఓడ రేవు వద్ద వున్న మరొక గోదాముకు విశాఖుణ్ణి తీసుకుపోయి, అక్కడ చెల్లాచెదురుగా పడివున్న పెట్టెలను చూపించి, ఆనందుడికి చెప్పినట్టే చెప్పి వెళ్ళిపోయాడు.

గోదాములోకి పోయి పెట్టెలు లెక్క పెడుతున్న విశాఖుడికి ఒక సందేహం కలిగింది. నలుగురు మనుషులు ఎంతో ఆయాసపడుతూ మోసుకువచ్చిన పెట్టెల్ని, గోదాములో వున్న ఒక్క మనిషి సునాయాసంగా ఎత్తి, ఒక దానిపై ఒకటి పేరుస్తున్నాడు!

పని పూర్తి కాగానే విశాఖుడు, చంద్ర నాగుడి దగ్గిరకు వెళ్ళి, పెట్టెలు మొత్తం



నూటపది అని చెప్పి, "అయ్యా, మీరనే ఆ చంద్రపురం వర్తకుడితో, తమకు లోగడే లావాదేవీలున్నవేమో, ఆ సంగతి నాకు తెలియదు. కాని అతడి నిజాయితీ గురించి మాత్రం నాకు అనుమానం కలుగుతున్నది. ఆ విషయం తమకు చెప్పడం, నా బాధ్యత!" అన్నాడు వినయంగా.

"ఏమిటది?" అని అడిగాడు చంద్ర నాగుడు.

"ఆ పెట్టెలనిండా వెండీ, యితర లోహాలతో చేసిన వస్తువులున్నట్టు, మీరు చెప్పారు. కాని, యిందులో ఆ వర్తకుడు మిమ్మల్ని తెలివిగా మోసగించినట్టు, నాకు అనుమానం కలుగుతున్నది. వాటిని గోదాములోకి మోసుకువచ్చిన నలుగురూ, ఆయన మనుషులేకదా! వాళ్ళు, వాటిని మోయడానికి ఎంతో శ్రమపడుతున్నట్టు నటించారు. అలా కాకపోతే మనవాడు ఒక్కడు వాటిని తేలిగ్గా ఎత్తి, ఒకదానిపై ఒకటి దొంతరగా అమర్చగలడా? ఆ పెట్టెల్లో వెండి వస్తువులుకాదు; ఏదో గడ్డీగాదం వున్నదని, నా అభిప్రాయం. తమరు వెంటనే గోదాముకు వచ్చి, వాటిని తెరిపించి చూడండి," అన్నాడు విశాఖుడు.

ఆ మాటలకు చంద్రనాగుడు తృప్తిగా నవ్వుకుని, విశాఖుడి భుజం తట్టి, "నువ్వు, సూక్ష్మగ్రాహివి!" అని మెచ్చుకుని, "ఆ పెట్టెలూ, వాటిని మోసిన నలుగురు మనుషులూ, గోదాములో వున్న వాడూ—అందరూ మనవాళ్ళే! ఉద్యోగం కోసం వచ్చిన, మీ యిద్దరి తెలివితేటలూ, చురుకుదనం తెలుసుకునేందుకు, యీ పరీక్ష పెట్టాను. అందులో నువ్వు నెగ్గావు. ఈనాటి నుంచే నువ్వు, నా దగ్గిర పనిలో చేరినట్టు నా వర్తక మిత్రుడికి, తెలియ చేస్తాను," అన్నాడు.

ఇది పరీక్ష అని తెలియకుండానే, అందులో తాను విజయం సాధించినందుకు, విశాఖుడికి చాలా ఆనందం కలిగింది.





# ఇల్లాలి కోరిక

భూపతికి కచ్చేరీలో చిన్న ఉద్యోగం. సాయంత్రం పనిముగియగానే, అతడు తోటి ఉద్యోగులతోపాటు ఇంటికి బయలు దేరాడు. ఇంటిని సమీపిస్తూండగా, భార్య నీల వాకిట్లో నిలబడి వుండడం కంటబడగానే, అతడి మనస్సు చివుక్కుమన్నది.

నీల ఎంతో నిరుత్సాహంగా, "ఈ రోజు కూడా మంచి పనసపండు దొరకలేదా?" అని అడిగింది.

"దొరికితే తేకపోదునా! దుకాణం వాడు రేపు మంచి పళ్ళు వస్తవని చెప్పాడు," అంటూ భూపతి తల పక్కకు తిప్పుకున్నాడు.

భూపతి సంపాదన ఇంటి ఖర్చులకు బొటాబొటిగా సరిపోతుంది. నెలలు నిండి వున్న భార్య యీనాటివరకూ అతణ్ణి, అది తినాలని వున్నది, ఇది తినాలని వున్నది అంటూ ఏమీ కోరలేదు. కాని, ఈ మధ్య ఆమెకు పనసపండు తినాలన్న కోర్కె కలిగింది. ఆమె మొహమాట పడుతూనే, యీ సంగతి భర్తకు చెప్పింది.

పనసపండు కొనాలంటే కనీసం ఆరు రూపాయిలైనా కావాలి. నెలాఖరు రోజులు కావడంతో భూపతి దగ్గిర అంత మొత్తం లేదు. అప్పు అడుగుదామంటే, తోటి ఉద్యోగుల పరిస్థితీ అలాగే వున్నదని అతడికి బాగా తెలుసు. ఆ కారణంగా, అతడు పనసపండు తీసుకురాకపోవడానికి ఏదో వంకలు చెప్పేస్తున్నాడు.

ఆ రాత్రి భూపతికి సరిగా నిద్రపట్టలేదు. తాను సాయంత్రం ఇంటికి వస్తూ, ఎవరి పెరట్లోనో చూసిన పనసచెట్టు అతడికి గుర్తు వచ్చింది. దానికి బోలెడు పనసకాయలు వేళ్ళాడుతున్నవి. చీకటి మాటునపోయి ఒకటి కోసుకువస్తే, భార్య కోరిక తీరుతుంది!

మాచిరాజు కామేశ్వరరావు



భూపతి యిలా కొంతసేపు ఆలోచించి, భార్య మంచి గాఢనిద్రలో వుండడం గమనించి, ఒక గోనెసంచీ తీసుకుని పెరటిదారిన బయిటికి వెళ్ళాడు.

అతడు పనసచెట్టున్న ఇల్లు చేరేసరికి అర్ధరాత్రి కావస్తున్నది. భూపతి నిశ్శబ్దంగా, ఇంటి ప్రహరీగోడ దూకి లోపల ప్రవేశించాడు. తరవాత పనసచెట్టు మొదట్లో వున్న కాయల్లో పక్వానికి వచ్చిన ఒక కాయను వెతికి, దాన్ని కోసి గోనెసంచీలో వేసుకున్నాడు.

అయితే, భూపతికి అంత బరువున్న పనసకాయతో గోడదూకడం సాధ్యపడ లేదు. అతడు వీధివాకిలి తెరుచుకుని బయిటికి పోవచ్చునుకుంటూ, గోడ పక్కగా కొంత దూరం నడిచి, అక్కడ కనబడిన దృశ్యం చూసి నిర్ఘాంత పోయాడు. ఒక మనిషి గుబురుగా పెరిగిన జామమొక్కల పక్కన చీకట్లో గుంట తవ్వుతున్నాడు! అతడి పక్కన గోనెసంచీలో ఏదో వస్తు వున్నది.

తను దొంగగా ఆ పెరట్లోకి వచ్చిన సంగతి మరిచిపోయిన భూపతి, "ఎవరు వాళ్ళు ?" అంటూ ఆ మనిషిని కరుకుగా ప్రశ్నించాడు.

గుంట తవ్వుతున్న మనిషి ఆ ప్రశ్న వింటూనే అదిరిపడి, చేతిలో వున్న గునపాన్ని జారవిడిస్తూ, "బాబ్బాబు, కాస్త గొంతు తగ్గించి మాట్లాడు. మా అవిడ లేచి వస్తుంది!" అన్నాడు మెల్లగా మూసి వున్న పెరటితలుపు కేసి ఎంతో భయంగా చూస్తూ.

అతను ఆ ఇంటి యజమాని అని తెలుసుకున్న భూపతి వెలవెలపోతూ, భుజాన వున్న గోనెసంచిని కింద పెట్టి, "క్షమించండి! మా అవిడకోసం, మీ చెట్టు నుంచి ఒక పనసకాయ కోసుకు పోతున్నాను," అన్నాడు.

ఇంటి యజమాని, భూపతి ముఖం కేసి ఒకసారి ఆశ్చర్యంగా చూసి, "పనస కాయా ? ఒకటి కాకపోతే పది కోసుకు

వెళ్ళు. ముందు, యీ గుంట తవ్వడంలో నాకు కాస్త సాయం చెయ్యి. ఈ గోనెలో వున్న చచ్చిన పిల్లిని గుట్టుమట్టుగా పాతి పెట్టాలి,'' అన్నాడు.

భూపతి బతుకు జీవుడా అనుకుని, గునపం తీసుకుని గుంట తవ్వసాగాడు. ఇంటి యజమాని చిన్న గొంతుతో, గోనెలో వున్న పిల్లికథ యిలా చెప్పాడు:

ఆ పిల్లి అంటే అతడి భార్యకు పంచ ప్రాణాలు. నాలుగు రోజులక్రితం ఆమె బంధువుల ఇంటికి పెళ్ళికి పోతూ, పిల్లిని కూడా తీసుకుపోవాలనుకున్నది. ఇప్పటికే ఆమెకూ, ఆ పిల్లికీ వున్న నేస్తాన్ని గురించి పక్క ఇళ్ళవాళ్ళు కథలుగా చెప్పుకుంటున్నారు.

ఆ కారణం వల్ల భర్త, ఆమెతో, ''దాన్ని యిక్కడే వదిలి వెళ్ళు. పెళ్ళికి వెళుతూ పిల్లిని చంకన బెట్టుకుపోవడం దేనికి, అక్కడ నలుగురూ విడ్డూరంగా చెప్పుకునేందుకా ?'' అన్నాడు.

ఆమె కొంచెంసేపు ఆలోచించి, ''ఆ మాటా నిజమే! ఆ కొత్తచోట, నా ముత్యాల పిల్లికి దిష్టి తగిలినా తగలొచ్చు. ఇక్కడే వదిలి వెళతాను. దాని అలనా పాలనా నువ్వే చూడాలి. తిరిగి వచ్చాక అది ఏ మాత్రం చిక్కిపోయినట్టు కనిపించినా, నీకు నాలుగు రోజులపాటు పస్తే!'' అన్నది.

ఆమె వెళ్ళిన మరుక్షణం నుంచీ పిల్లి అరుస్తూ, ఇల్లంతా తిరగసాగింది. ఈ





నాలుగు రోజులుగా అది పాల వాసన కూడా చూడలేదు. సొమ్మసిల్లి గోడవారగా ముడుచుకు పడుకున్నది. భార్య వచ్చే సమయానికి, అది కళ్ళు తేలవేసి నిగడ దీసుకుపోయింది. అటు భార్య భయంతో ఏమీ పాలుపోని ఇంటి యజమాని దాన్ని గోనెలో వేసి, అటక మీద దాచేశాడు.

అతడి భార్య ఇంటికి వస్తూనే, "నా కన్నతల్లి, నా ముత్యాలపిల్లి—ఏదీ ?" అంటూ ఇల్లంతా వెతకసాగింది.

పిల్లి చచ్చిపోయిందని చెబితే, భార్య అన్నంత పనీ చేస్తుందని ఎరిగిన ఇంటి యజమాని ఆవిడతో, "నువ్వు వెళ్ళిన రోజు రాత్రే, అది నీ కోసం బెంగ పెట్టుకుని ఎటో వెళ్ళిపోయింది. నువ్వు వచ్చావు గదా, అదీ వస్తుందిలే !" అని సర్ది చెప్ప చూశాడు.

కాని, ఆమె పెద్ద గొడవచేసి, భోజనం చెయ్యకుండా ఏడుస్తూ పడుకున్నది. ఆమెకు కొంచెం కునుకు పట్టిందని తెలియగానే, ఇంటాయన లేచి పిల్లిని పూడ్చి పెట్టేందుకు పెరట్లో గుంట తవ్వుతున్నాడు !

భూపతి సాయంతో త్వరలోనే గుంట తవ్వడం పూర్తయింది. ఇంటి యజమాని అతడికింకేదో చెప్పబోతున్నంతలో, అతడి భార్య తలుపు తీసుకుని వస్తూ, భర్తను, "ఇంత చీకట్లో పెరట్లో ఏం చేస్తున్నావు?" అంటూ కోపంగా ప్రశ్నించింది.

భార్యను చూస్తూనే ఇంటి యజమాని గాభరా పడిపోతూ, గోనెను గుంటలోకి తోసి, భూపతితో, "నే వెళుతున్నాను. బాబ్బాబు, నువ్వు కాస్త గుంట పూడ్చి మరీ వెళ్ళు," అంటూ భార్యకు ఎదురు వెళ్ళాడు.

ఆ భార్యా, భర్తలు ఇంట్లోకి పోగానే భూపతి గుంట మీద యింత మన్ను కప్పి, వీధి వాకిలిగుండా బయటికి వచ్చి, గబగబా ఇంటికేసి నడవసాగాడు. దారిలో అతడికి గస్తీ తిరుగుతున్న యిద్దరు రక్షక భటులు తారసపడ్డారు.

వాళ్ళు, భుజం మీద గోనెతో చీకట్లో పడిపోతున్న భూపతిని చూడగానే అను మానించి, ఆగమని, ''ఈ అర్ధరాత్రివేళ ఎవడిల్లు దోచి పరిగెత్తుతున్నావు?'' అని అడిగారు.

భూపతి గజగజ వణికిపోతూ, ''అయ్యా, నేను పరిగెత్తడం లేదు, మామూలుగానే నెమ్మదిగా నడిచిపోతు న్నాను. నేనేం దొంగను కాదు. నా భార్య కోసం పనసకాయ పట్టుకుపోతున్నాను,'' అన్నాడు.

''ఈ మాట నమ్మమంటావా?'' అంటూ ఒక రక్షకభటుడు చేతిలో వున్న కర్రతో గోనెను పొడిచాడు.

ఆ వెంటనే గోనెలో నుంచి, "మ్యావ్!" అన్న పిల్లి అరుపు వినిపించింది.

భూపతికి చాలా ఆశ్చర్యం కలిగింది. భార్య వస్తున్నదన్న గాభరాలో ఇంటి యజమాని పనసకాయ వున్న గోనెను గొతిలోకి తోశాడన్నమాట! అతను చచ్చిం దనుకున్న పిల్లి, నిజంగా చావలేదు, తిండీ తిప్పల్లేక సొమ్మసిల్లిపడిపోయి వుంటుంది.

రక్షకభటు లిద్దరూ పిల్లి అరుపు వింటూనే పెద్దగా నవ్వి, ''నీ పెళ్ళాం పిల్లిని పనసకాయ అని పిలుస్తుందా? నువ్వేదో మంత్రగాడివని, మా అను మానం. అందువల్లే, పిల్లిని యీ అర్ధ



రాత్రివేళ ఏ వల్లకాటికో మోసుకుపోతు న్నావు. తెల్లవారి, నీ అసలు స్వరూపం బయట పెట్టిస్తాం, పద!'' అంటూ భూపతి ఎంత చెబుతున్నా వినకుండా, అతణ్ణి తీసుకుపోయి చెరసాలలో వేశారు.

బాగా పొద్దెక్కిన తరవాత చెరసాల అధికారి అక్కడికి వచ్చాడు. రక్షక భటులు ఆయనతో, ''రాత్రి ఒకణ్ణి పట్టు కున్నాం. వాడు మంత్రగాడని, మా అను మానం!'' అని చెప్పి, భూపతి వున్న గది దగ్గిరకు తీసుకుపోయారు.

భూపతి ఆ అధికారిని చూసి చాలా వింత పడ్డాడు. రాత్రి ఆయన్నే, పెళ్ళాం దగ్గిర పిల్లిలా అతడు చూసి వున్నాడు.

భూపతినీ, ఆ పక్కనే వున్న పిల్లినీ చూడగానే అధికారికి సంగతి తెలిసి పోయింది. చచ్చిపోయిందనుకున్న పిల్లి, బతికి వుండడం కంటబడగానే ఆయనకు కలిగిన ఆనందం అంతా యింతా కాదు. ఇక తాను యిప్పట్లో భార్యకు. భయపడ వలసిన పని లేదు!

ఆయన రక్షకభటులకేసి కళ్ళెర్ర చేస్తూ చూసి, "ఈయన ఎంతోకాలంగా నాకు తెలుసు. గొప్ప మర్యాదస్థుడు, పెద్ద మనిషి. ఈయన్నా మీరు మాంత్రికుడూ, దొంగా అంటూ చెరసాలలో పెట్టింది! ఊఁ, యిక్కణ్ణించి కదలండి!" అంటూ హుంకరించాడు.

రక్షకభటులు బెంబేలు పడిపోతూ అక్కణ్ణించి వెళ్ళిపోగానే, చెరసాల అధి కారి భూపతిని విడుదల చేసి, పిల్లిని ఆప్యాయంగా చేతుల్లోకి తీసుకుని, "మా కన్నతల్లి ప్రాణదాతలు మీరు! మీ ఋణం ఎలా తీర్చుకోవాలో బోధపడడం లేదు. బంగారంలాంటి మీ పనసకాయ నా తొందరపాటువల్ల గోతి పాలయింది. ఈ డబ్బుతో మీ ఆవిడకు మంచి పనస పండు కొనుక్కు వెళ్ళండి," అంటూ వద్దన్నా వినకుండా బలవంతంగా భూపతి చేతిలో పది రూపాయలు పెట్టాడు.

భూపతి పరమానందంపడిపోతూ అక్కడినుంచి బయలుదేరి, బజారులో మంచి పనసపండు కొని, ఇంటి దారి పట్టాడు.

అతడు ఇల్లు చేరగానే, వాకిట్లో పొరు గింటి మంత్రసాని పుల్లమ్మ ఎదురుపడి, "రాత్రంతా కనిపించలేదు. ఎక్కడికి వెళ్ళావు?" అని అడిగింది చిరుకోపంగా.

ఏం చెప్పాలో తోచని భూపతి, "మా ఆవిడ కోసం పనసపండు తెచ్చేందుకు వెళ్ళాను," అన్నాడు.

ఈ జవాబుకు పుల్లమ్మ నవ్వి, "ఇక పనసపండుతో పనిలేదు. నీ భార్య, యీ తెల్లవారుగట్ల పనసపండులాంటి బాబును కన్నది. లోపలికి రా, చూద్దువుగాని!" అన్నది.





# చెట్టు నీడ

ఒక గ్రామంలో ఒక ఆసామీ ఇంటి ముందు పెద్ద చెట్టుండేది. వేసవికాలంలో దాని నీడలో చల్లగా ఉండేది. ఆసామీ అప్పుడప్పుడూ అక్కడికి వచ్చి కూచుంటూ ఉండేవాడు.

ఒకనాటి మధ్యాహ్నం ఆయన భోజనం చేసి చెట్టు కింద కూచోటానికి వచ్చేసరికి అక్కడ ఒక అలగావాడు కూచుని ఉన్నాడు.

"ఇదేమిటి? నిన్నిక్కడ ఎవరు కూచోనిచ్చారు? పద, పద!" అని ఆసామీ అలగావాణ్ణి అదిలించాడు.

"ఎందుకు, బాబూ, అలా కోప్పడతారు? ఎండ జాస్తిగా ఉంది. నీడలో చల్లగా ఉందని కూచున్నాను!" అన్నాడు అలగావాడు మర్యాదగా.

"అదేమీ కుదరదు. ఈ చెట్టు నా చెట్టు. నేను దీనికి ఎన్నో ఏళ్ళుగా నీళ్ళు పోసి పెంచి ఇంత చెట్టు చేశాను. అందుచేత దీని నీడ కూడా నాదే!" అన్నాడు ఆసామి.

"అలా చెప్పరేం; అయితే ఒక పని చేయండి. ఈ నీడ నాకు అమ్మండి, డబ్బిస్తాను!" అన్నాడు అలగావాడు.

డబ్బు మాట వినేసరికి ఆసామీకి ఆశ పుట్టుకొచ్చింది. "సరే, అమ్ముతాను. ఏమిస్తావు?" అన్నాడాయన.

బేరం జరిగింది. ఇద్దరు ముగ్గురు దారే పొయ్యేవాళ్ళ సమక్షంలో అలగావాడు ఆసామీకి డబ్బిచ్చి చెట్టు నీడను తను కొనేసుకున్నాడు.

అది మొదలు అలగావాడు రోజూ వచ్చి చెట్టు నీడను కూచుంటూండేవాడు; దారిన ఎరిగున్న వాళ్ళెవరన్నా పోతూంటే వాళ్ళను కూడా పిలిచి నీడలో కూచోబెట్టేవాడు. అలా వచ్చిన వాళ్ళ వెంట

పశువులుంటే అవి కూడా హాయిగా నీడలో చేరేవి.

ఇది చాలక, నీడ కొన్న అలగావాడు మరొక పని చేయ నారంభించాడు. ఆ చెట్టు నీడ ఎక్కడెక్కడ పడేదో అక్కడి కల్లా వెళ్ళేవాడు. సమయాన్ని బట్టి, ఋతువునుబట్టి, ఆ చెట్టు నీడ ఆసామీ ఇంటి ఆవరణలోనూ, పంచలోనూ, పడక గదిలోనూ, నడవలోనూ పడేది. అలగా వాడు మొహమాటం లేకుండా నీడపడిన చోటికల్లా వెళ్ళి తిష్ఠవేసేవాడు.

ఇదంతా చూసి ఆసామీకి మండి పోయింది. "ఏయ్, మా దొడ్లోకీ, వసారా లోకీ, గదిలోకీ వచ్చి కూచునేటందుకు నీకేం హక్కున్నది?" అని ఆయన అలగావాణ్ణి గద్దించి అడిగాడు.

"బాబుగారూ, నేను మీ చెట్టునీడను డబ్బుపోసి కొనుక్కున్నాను. అది ఎక్కడెక్కడ పడుతుందో అక్కడల్లా కూచో టానికి నాకు హక్కున్నది!" అన్నాడు అలగావాడు.

ఆసామి రుసరుసలాడాడు. కాని తాను చెట్టునీడను వాడికి అమ్మిన మాట నిజమే.

ఒకరోజు ఆసామి ఇంట ఏదో అక్కర అయింది. చుట్టాలనూ, బంధువులనూ పిలిచి విందు చేస్తున్నాడు. వారంతా భోజనం చేసే చోట చెట్టునీడ పడింది. సమయానికి అలగావాడు చక్కా వచ్చి, ఆ నీడలో కూచున్నాడు. వచ్చిన అతిథులకు ఇదేమీ అర్థం కాలేదు. "పిలవని పేరంటంగా వచ్చి ఈ మనిషి ఎవరో ఇక్కడ చతికిలబడ్డాడేమిటి?" అని వారు ఒకరినొకరు ప్రశ్నించుకున్నారు.

అలగావాడు తాను నీడ కొనుక్కున్న వైనమంతా వాళ్ళకు చెప్పేశాడు.

ఈ వింత సంగతి వింటూనే అక్కడ వున్న అతిథులందరూ గొల్లున నవ్వారు.

ఆసామికి నలుగురిలోనూ తల తీసేసి నట్టయింది.

ఆ మర్నాడే ఆయన తన కుటుంబంతో సహా ఆ గ్రామం విడిచి, మరో దూర గ్రామానికి వెళ్ళిపోయాడు.





# విఘ్నకథ

సుగ్రీవుడు కిష్కింధకు రాజై, వాలి కుమారుడు అంగదుణ్ణి యువరాజును చేసి, రాచకార్యాలన్నీ అప్పజెప్పి, తాను సుఖాల్లో తేలుతూ రాముడి సంగతే మరిచాడు. లక్ష్మణుడు విల్లెక్కుపెట్టి కిష్కింధకు వెళ్ళాడు. హనుమంతుడు రామకార్యం నెరవేర్చడం తక్షణకర్తవ్యంగా సుగ్రీవుడికి బుద్ధిచెప్పాడు.

వానరులను నాలుగు దిక్కులకూ సీత జాడ తెలుసుకు రమ్మని సుగ్రీవుడు ఆజ్ఞాపించాడు. అంగదుడు, హనుమంతుడు, జాంబవంతుడు మొదలైనవారంతా దక్షిణ దిశకు బయలుదేరుతున్నప్పుడు, రాముడు తన వేలిఉంగరాన్ని తీసి హనుమంతుడికి సీతకు ఆనవాలుగా యిమ్మని యిచ్చాడు.

దక్షిణ సముద్రతీర ప్రాంతం చేరుకొని వానరులు, ''జటాయువు రావణుడు సీతనెత్తుకొని దక్షిణంగా వెళ్ళాడని చెప్పాడేగాని, ఎటు మళ్ళాడో, ఎక్కడ దాచాడో, ఏం చేశాడో ఎవరికి తెలుసు?'' అని అనుకుంటూండగా, వానరులను ఆహారంగా కబళిద్దామనుకుంటున్న జటాయువు అన్న సంపాతి అనే పర్వతాకారంగల రెక్కలులేని పక్షి మెల్లగా నడుస్తూ వచ్చింది.

ఒకప్పుడు సంపాతీ, జటాయువూ సూర్యమండలానికి ఎగురుపందెం వేసుకున్నారు. జటాయువు ఎగరలేక విరమించాడు. సంపాతి ఎగిరి రెక్కలు కాల్చుకున్నాడు. దక్షిణ సముద్ర తీరాన



అవిటివాడై పడిపోయి ఎలాగో దొరికిన ప్రాణుల్ని తిని బ్రతుకుతున్నాడు.

సంపాతి వానరుల వలన జరిగినదంతా తెలుసుకొని, అంగదుణ్ణి వీపున ఎక్కించుకొని నిటారుగా లేచి దూరదూరాల్లో సముద్రానికి అవల ఉన్న లంకను చూపించాడు.

శతయోజన పర్యంతమైన సముద్రాన్ని లంఘించి లంకను చేరగలవా డెవడు? అనుకున్నారు వానరులు.

హనుమంతుడికి అతని శక్తిసామర్థ్యాలు అతనికి తెలియకుండా, బాల్యంలో అల్లరి చేయగా ఋషులు శాపం పెట్టారు. అది తెలిసిన జాంబవంతుడు, ''హనుమంతా! నువ్వు అవలీలగా సముద్రాన్ని లంఘించి రామకార్యం నెరవేరుస్తావు!'' అని ఎరుక చేశాడు.

అప్పుడు హనుమంతుడు రాముణ్ణి ధ్యానించి నేలను తన్ని ఆకాశానికి ఎగిరాడు.

మారుతి సముద్రాన్ని లంఘిస్తూండగా, అతడి శక్తియుక్తుల్ని పరీక్షించడానికి దేవతలు సురసను పంపారు.

దేవతాస్త్రీ అయిన సురస భయంకర రాక్షసాకారంతో నోరావులించి హనుమంతుణ్ణి ఎదుర్కొంది. హనుమ శరీరాన్ని పెంచాడు. సురస కూడా పెరిగింది. హనుమంతుడు యింకా పెరిగాడు. సురస మరింత, మరింత పెరిగి మ్రింగవచ్చింది. హనుమంతుడు చప్పున సూక్ష్మాతిసూక్ష్మంగా తగ్గిపోయి, సురస నోట్లో దూరి, పెరిగిపోయి దాన్ని చీల్చుకొని బయటపడి ఎగిరి వెళ్ళాడు. సురస దేవతాస్త్రీ రూపంతో వెళ్ళిపోయింది. దేవతలు హనుమంతుణ్ణి శ్లాఘించారు.

హనుమంతుడు అలా ఎగురుతూండగా సముద్రంలో పడిన అతని నీడను రాహువు తల్లి సింహిక అనే జలరాకసి పట్టుకొని లాగసాగింది. హనుమంతుడు తన్నేదో కిందినుంచి వెనక్కు లాగుతున్నదనిపించి కిందికి చూశాడు. సింహికను పిడిగుద్దులతో చంపేశాడు.

హనుమంతుడు అవరోధాలన్నీ జయించి, అలా ఆకాశాన వెళ్తూండగా సువర్చల అనే సాగరకన్య చేపరూపంతో నోరు తెరిచి ఆశ్చర్యంగా చూస్తూండగా హనుమంతుడి చెమట బిందువొకటి పడింది. చేప మింగింది. అందువల్ల సువర్చల గర్భం ధరించి మత్స్యవల్లభుడు అనే కుమారుణ్ణి కన్నది.

ఒకప్పుడు ఇంద్రుడు పర్వతాలకు ఉండే రెక్కలను వజ్రాయుధంతో నరుకుతూండగా, హిమవంతుడి కుమారుడైన మైనాకుడు భయపడి సముద్రంలో దాక్కున్నాడు.



హనుమంతుడిని చూసి మీదకు వచ్చి, "అంజనేయా, కాస్త నాపై వాలి సేద దేరమని అభ్యర్థిస్తున్నాను," అన్నాడు.

మైనాకుడి మాట కాదనకుండా హనుమంతుడు, కొద్దిక్షణాలు మైనాకపర్వతం మీద కాలుమోపి తిరిగి రివ్వున ఎగిరాడు.

హనుమంతుడు మెరుపులాగ లంకను చేరాడు.

లంకానగరాన్ని పరిరక్షించే లంకానగర దేవత లంకిణి, హనుమంతుడి ఆగమనాన్ని గుర్తించి, భీకరాకృతితో శూలాన్నెత్తి పొడవబోయింది.

హనుమంతుడు సూక్ష్మరూపంతో తప్పించుకొని, లంకాద్వారాన్ని దాటబోయాడు. లంకిణి హనుమంతుణ్ణి ఈగను పట్టినట్లు గుప్పెట్లో పట్టింది. హనుమంతుడు లంకిణి అరచేతిని కరిచాడు. లంకిణి వదిలేసింది. దాని అరచేయి రక్తం కారుతూన్నది.

హనుమంతుడు ఒక్క ఉదుటున లంఘించి పిడికిలితో లంకిణి గుండె మీద గుద్దాడు. ఆ ముష్టిఘాతంతో లంకిణి దిమ్మరపోయి పడిపోయింది.

లంకిణి తేరుకొని అంజనేయుడికి నమస్కరించి, "ఎప్పుడైతే నేను యిలా కూలిపడతానో, ఆ నాటితో లంకకు వినాశకాలం పడుతుందని నాకు, బ్రహ్మ చెప్పాడు. శాపంవల్ల నేను క్షుద్రదేవతగా



యిలా లంకా నగరాన్ని యిన్నాళ్ళూ కాపలా కాస్తూ వచ్చాను. నేను వెళ్ళి పోతున్నాను, యిక నీవు వెళ్ళు!'' అని చెప్పి గంధర్వస్త్రీ రూపంతో ఆకాశానికి ఎగిరి అంతర్ధానమైంది.

హనుమంతుడు లంకా నగరం ప్రవేశించాడు. మణిదీపాలతో, ఎత్తైన సౌధాలతో కన్నులు మిరుమిట్లు గొలుపుతున్న లంకా వైభవానికి ఆశ్చర్యపోయాడు.

హనుమంతుడు సూక్ష్మరూపంతో సీత కోసం నగరమంతా వెతికాడు. రావణాసురుడి అంతఃపుర భవనాలన్నీ వెతికాడు. మందోదరిని సీత అనుకొని భ్రమపడి పొరపాటు గ్రహించాడు.

సీత జాడ ఎక్కడా లేదు. అలా వెతుకుతూ అశోకవనం చేరుకున్నాడు. అక్కడ రామనామ స్మరణ విన్నాడు.

ఒక చంద్రశిలా నిర్మిత మంటపంలో సీత రాముణ్ణి తలంచుతూ శోకిస్తూన్నది.

ఆ మంటపం చుట్టూరా పెద్ద బల్లేలు, కత్తులు మొదలైన ఆయుధాలు పట్టుకొని రాక్షసస్త్రీలు కాపలా ఉన్నారు.

మంటపం చేరువనే ఉన్న శింశుపా వృక్షం ఎక్కి హనుమంతుడు కొమ్మల మాటున కూర్చుని చూస్తున్నాడు.

సీత మంటపం నుండి వచ్చి, పక్కనున్న అశోక చెట్టు కింద కూర్చున్నది.

రావణుడు పటాటోపంగా అశోకవనంలోకి వస్తున్నాడు. అతని వెనక దేవ, గంధర్వ, నాగ, యక్ష, రాక్షస, మానవ సుందరీమణులు గుంపులు, గుంపులుగా అతడి వైభవాన్ని కీర్తిస్తున్నారు.

రావణుడు అశోకవృక్షం దగ్గిరికి వచ్చి, ''ఓ, సీతా! ఇప్పటికైనా, నా మాట విను! క్షుద్ర మానవుడైన రాముణ్ణి నమ్ముకోకు. రాముడు లంక చేరగలడనేది కల్ల!'' అన్నాడు.

సీత ఒక గడ్డిపరకను పెరికి దానితోనే, ''ఓ, రావణా! నీ ప్రగల్భానికీ, బలవైభవాలకీ నేను లొంగుతాననేది కల్ల! నీవు దొంగవు! నిన్ను శిక్షించడం రాజైన

రాముడికి కర్తవ్యధర్మం. దశకంఠ శోషగా వాగకు. రాముడు నిన్ను పరిమార్చక ముందే, నీ ముచ్చటలన్నీ తీర్చుకో! అంతఃపురానికి వెళ్ళు. త్వరలోనే నీకు అంత్యకాలం!" అన్నది.

రావణుడా మాటలకు పెద్ద గండ్ర కత్తి తీసి, "నిన్ను ముక్కలుగా నరుకుతాను!" అన్నాడు.

"అలా చేయవు! నా అంతట నేను, నీకు లొంగిపోతానని అనుకుంటున్నావు. రాముడి భార్య, రావణుడి ప్రతాప వైభవాలను చూసి లోబడిపోయింది అనిపించుకోవాలని, నీ దురహంకార దురాకాంక్ష!" అన్నది సీత.



"ఔను! మా రాక్షస వనితకు జరిగిన పరాభవానికి, అదే సరియైన ప్రతీకారం! అదే నా పట్టుదల!" అన్నాడు రావణుడు.

"కాదు! నువ్వు రాముడిని ఎదుర్కొని జయించి, నన్ను తీసుకుపోవలసింది. నువ్వు పిరికివాడవు. మాయలు పన్ని చోరవృత్తిని అవలంబించావు. రాముడు నిన్ను సంహరించాలి! ఇది నా పట్టుదల!!" అన్నది సీత.

రావణుడు రుసరుసలాడుతూ వెళ్ళాడు.

హనుమంతుడు రాక్షస స్త్రీలు లేని సమయం చూసి, చెట్టు దిగి, సీతకు రాముడి ఉంగరాన్ని యిచ్చాడు. చుక్కలు తల పూవులుగా పెరిగిన తన విశ్వరూపం చూపించి, తన వీపున కూర్చుంటే రాముడి దగ్గరకు చేరుస్తానన్నాడు.

"అది సక్రమం కాదు; రాముడు రావణుడిని సంహరించి నన్ను విడిపించాలి! అంతవరకు సీత అశోకవనంలో శోకంలోనే ఉంటుందని రాముడితో చెప్పు!" అని చెప్పి సీత తన పాపిటనున్న చూడామణిని తీసి, రాముడికి యిమ్మని హనుమంతుడికి యిచ్చింది.

హనుమంతుడు తన రాక తెలియాలని సుందరమైన అశోకవనాన్ని ధ్వంసం చేశాడు. చంపవచ్చిన జంబుమాలిని, అక్షయుడిని, వేలాది రాక్షసుల్ని చంపాడు.



రావణుడి పెద్ద కుమారుడు ఇంద్ర జిత్తు బ్రహ్మాస్త్రాన్ని ప్రయోగించాడు. బ్రహ్మపట్ల గౌరవంగా క్షణకాలం హను మంతుడు అస్త్రానికి బద్ధుడై, రావణుడికి ముఖాముఖి బుద్ధి చెప్పాలని కట్టుబడి రావణ సభకు వెళ్ళాడు.

రావణుడు ఎత్తైన సింహాసనం మీద నుంచి, కింద ఇనుప గొలుసులతో బందీగా వున్న హనుమంతుణ్ణి వంగి పరిహాసంగా చూశాడు.

హనుమంతుడు మేను పెంచి గొలు సులు తెంచుకొని, రావణుడి తల తన్నె ఎత్తున తన తోకను పెంచి, చుట్ట చుట్టు కొని దానిపై కూర్చున్నాడు.

హనుమంతుడు, "ఓయి, రావణ రాక్షసరాజా! నేను రాముడి దూతను. రాముడు కోతులనే మహావీరులుగా నడి పించి, నీ లంకను ముట్టడించగల సమర్థు డైన మానవశ్రేష్ఠుడు. బలమున్నదని గర్వించకు. బలవంతమైన సర్పము చలి చీమలచేత ఏ విధంగా చస్తుందో, నీకు చెప్పనవసరం లేదు. సీతను రాముడికి అప్పగించి మన్నించమని వేడు!" అని చెప్పాడు.

రావణుడు పట్టరాని ఆగ్రహంతో కత్తి తీశాడు. విభీషణుడు రావణుడితో, "దూతను చంపకూడదు, అది పౌరుషం అనిపించుకోదు!" అన్నాడు.

రావణుడు, "అలాగైతే, యీ వాన రుడి తోక పొగరు అణిగేలా గుడ్డలు చుట్టి చమురుపోసి కాల్చండి!" అని ఆజ్ఞా పించాడు.

రాక్షసభటులు హనుమంతుడి తోకకు గుడ్డలు చుట్టినకొద్దీ తోక పెరిగిపోతూనే ఉంది. చమురు చాలలేదు. నిప్పంటిం చారు. హనుమంతుడు శరీరం పెంచి సింహనాదం చేసి ఛెంగున ఎగిరాడు.

కాలుతున్న తోకను గిరగిరా తిప్పుతూ, సౌధాల మీంచి దూకుతూ, లంకా పట్ట ణాన్ని అగ్నికి ఆహుతి చేశాడు. అతనికి అగ్ని చల్లగా తోచింది ఆర్పడానికి వీలు

కాకుండా లంకాదహనం జరిగింది. రావణుడి అంతఃపుర సౌధాలు కాలి పోయాయి. మంటల్లో చాలామంది రాక్షసులు చచ్చారు. విభీషణుడి మందిరం మాత్రం చెక్కు చెదరలేదు.

హనుమంతుడు అశోకవనంలో సీత క్షేమంగా ఉండడం చూసి, రివ్వున ఎగిరి సముద్రంలో తోకను ముంచి మంటలార్పుకొని, చూడామణిని పట్టుకొని రాముడి ముందు వాలాడు.

రాముడు చూడామణిని చూసి, సీతను చూసినట్లుగా గుండెలకు హత్తుకొన్నాడు.

హనుమంతుడు అంతా చెప్పాడు.

రాముడు హనుమను ఆలింగనం చేసుకొని, "హనుమా! చూసి రమ్మంటే కాల్చి వచ్చావన్నమాట! నీవంటివాడు అండ ఉండగా, నేను సాధించలేనిదంటూ ఉండదు. సీతకూ, నాకూ సంధానకర్తవై, ఆనందం చేకూర్చిన నీవు బుద్ధిమంతుడవు, ఆనంద సంధాతవు, కీర్తిమంతుడవు ఔతావు!" అన్నాడు.

రాముడు కోదండాన్ని ఎత్తి పట్టుకొని, సీత చెప్పినట్టుగా రావణసంహారానికి దీక్షాకంకణం కట్టుకున్నాడు.

విభీషణుడు రావణుడికి సవతి తమ్ముడు. రాముడితో వైరం పెట్టుకోవద్దనీ, సీతను సగౌరవంగా తీసుకెళ్ళి, రాముడికి అప్పగించి, లంకానగరాన్నీ, లంకావాసుల్నీ కాపాడమని చెప్పాడు.

"నీ ఒక్కడి పట్టుదల, మూర్ఖతవల్ల రాక్షసకులానికే ముప్పు తేవడం అన్యాయం!" అని విభీషణుడు చెప్పిన దానికి, రావణుడు మండిపడి, "ఓరీ, పిరికిపందా! నువ్వు రాక్షసకులంలో తప్ప పుట్టావు! శూర్పణఖకు చేసిన పరాభవం రాక్షస జాతికంతటికీ పరాభవం అని తెలుసుకో! నువ్వు కులద్రోహివి! వెంటనే లంక వదలి వెళ్ళిపో! మళ్ళీ కనిపించావో, నిన్ను చిత్రవధ చేస్తాను!" అన్నాడు.

విభీషణుడు తన అనుచరులతో లంక వదిలి పెట్టాడు.





# నువ్వే నేను - నేనే నువ్వు!

సోమయ్యకు పాతిక సంవత్సరాలు నిండగానే, ఉన్నట్టుండి లావెక్కడం ప్రారంభించాడు. అతడెంత లావెక్కిపోయాడంటే, జనం అతడేమైనా అనుకుని పోతాడేమో అన్న శంక కూడా లేకుండా, అతడి ముఖం ఎదటే నవ్వసాగారు.

సోమయ్య వైద్యుడి దగ్గిరకు వెళ్ళి, తను లావు తగ్గే ఉపాయం ఏదైనా చెప్పమన్నాడు. "రోజూ రెండు కోసుల దూరం ఆగకుండా పరిగెత్తు. నెల రోజుల్లో సన్నబడిపోతావు," అన్నాడు వైద్యుడు.

రెండుకోసులదూరం అంటే, నలుగురూ నడిచే బాటలోనే పరిగెత్తాలి. సోమయ్య ఒకరోజు అలాగే చేశాడు. దారిపొడుగునా అతడికి జనం ఎదురయ్యారు. అతడి పరుగు చూసి చాలామంది నవ్వారు.

ఆ నవ్వేవాళ్ళలో ఒకడు సోమయ్యను ఎందుకలా పరిగెడుతున్నావని అడిగి, సంగతి తెలుసుకున్నాడు. మర్నాడు సోమయ్యకు నిన్నటికంటే, ఆ రోజు దారిపొడుగునా ఎక్కువమంది జనం కనిపించారు.

ఇది పనికాదనుకుని సోమయ్య తెల్లవారు జామునే లేచి పరుగెట్టాలనుకున్నాడు. ఒకరోజు అలాగే చేశాడు. ఒకరిద్దరు దారిలో కనిపించినా, లోగడలాగా నవ్వేవాళ్ళు ఎక్కువ కనిపించలేదు. కాని, తెల్లవారుజామున లేవడం అతడికి చాలా యిబ్బందిగా తయారయింది. ఆ సమయంలోనే అతడికి గాఢంగా నిద్ర పడుతున్నది.

సోమయ్య మళ్ళీ వైద్యుడి దగ్గిరకు వెళ్ళి, "పరుగెట్టడం, చాలా కష్టంగా వున్నది; అది నావల్ల కాదు. ఇంకా సులభమైన ఉపాయం ఏదైనా వుంటే చెప్పండి," అని అడిగాడు.

"వసుంధర"



సోమయ్య వెంటనే వైద్యుడి దగ్గిరకు పోయి, "రెండు రోజులు మితంగా తిన్నాను; బాగా చిక్కిపోయాను. మూడో రోజున ఆగలేక మామూలుగా భోజనం చేశాను. మళ్ళీ మామూలుగా లావెక్కిపోయాను. ఇలా అయితే ఎలా? పూర్తిగా చిక్కి, అలాగే వుండిపోవాలంటే, ఎన్నాళ్ళు మితంగా తినాలి?" అన్నాడు.

"ఎన్నాళ్ళేమిటి? నువ్వు బతికున్నన్నాళ్ళూ యిలాగే మితంగా తినాలి. ఎప్పుడైతే మామూలుగా తినడం ప్రారంభిస్తావో, అప్పుడు వెంటనే మళ్లీ లావెక్కడం ప్రారంభమవుతుంది. అది నీ శరీర తత్వం!" అన్నాడు వైద్యుడు.

"బతికున్నన్నాళ్ళూ తిండి లేకుండా మాడిపోవడం, నావల్ల కాదు. ఇంకేదైనా ఉపాయం వుంటే చెప్పండి," అని సోమయ్య ప్రాధేయపడ్డాడు.

"నా దగ్గిర ఒక మందున్నది. అది వాడి చూడు!" అంటూ వైద్యుడు, సోమయ్యకు పది గుళికలు యిచ్చి, రోజూ ఒక్కొక్కటి చొప్పున ఉదయమే వేసుకోమన్నాడు.

మర్నాడు సోమయ్య ఒక గుళిక మింగాడు. గొంతంతా భగ్గుమన్నది. నాలుకపై అదోకరకం మంట పుట్టింది. ఆ రోజంతా అతడేం తినలేకపోయాడు.

"అదెంత భాగ్యం! ఆహారం మితంగా తీసుకో. రోజూ ఒక లోటా పాలు, మరొక లోటా పళ్ళరసం, నిమ్మకాయంత మజ్జిగ అన్నం. ఇలా తిన్నావంటే, నీ లావు తగ్గిపోవడానికి రెండు నెలలు చాలు," అన్నాడు వైద్యుడు.

సోమయ్య, వైద్యుడు చెప్పినట్టే రెండు రోజులు చేశాడు. ఆ రెండు రోజులకే అతణ్ణి ఎక్కడలేని నీరసం పట్టుకున్నది. తిండి కోసం మొహం వాచిపోయాడు. కొంత చిక్కిపోయిన మాట నిజం. అయితే సోమయ్య మూడో రోజున మామూలుగా భోజనం చేశాడు. తిరిగి మనిషి మామూలుగా అయిపోయాడు.



గుళికలో బలవర్ధకాహారం ఏమైనా వున్న దేమో, అతడికి నీరసం మాత్రం రాలేదు.

మర్నాటికి సోమయ్యకు నాలుక మంట కొంచెం తగ్గినట్టనిపించింది. కాని, మళ్ళీ గుళిక మింగగానే యథాప్రకారం నాలుక మండసాగింది. ఆ రోజు కూడా అతడేమీ తినలేకపోయాడు. అసంతృప్తిగా వున్నప్పటికీ సోమయ్య, వైద్యుడిచ్చిన గుళికలన్నీ మింగాలనుకున్నాడు.

ఆ రాత్రి సోమయ్య ఇంటికి ఒక మరుగుజ్జువాడు వచ్చాడు. వాడు పొరుగూరు వెళుతూ, వాన కారణంగా సోమయ్య ఆతిథ్యం కోరాడు. సోమయ్య అతడికి మర్యాద చేసి, మంచి భోజనం పెట్టాడు. తాను మాత్రం ఏమీ తినలేదు.

''నువ్వు చాలా మంచివాడివి. ఇలాంటి ఆతిథ్యం నాకెవ్వరూ యివ్వలేదు. కాని, నాతో కలిసి నువ్వు భోజనం చేయక పోవడం చాలా బాధగా వుంది,'' అన్నాడు మరుగుజ్జు.

అప్పుడు సోమయ్య, మరుగుజ్జుకు తన కథ చెప్పాడు.

అంతా విని మరుగుజ్జు, ''నీ సంగతి సరే! నువ్వు కావాలనుకుంటే సన్నబడవచ్చు. మరి నా సంగతేమిటి? నన్ను పొడవాటివాడుగా చేయగల వైద్యమేలేదు. అంతా నా మరుగుజ్జుతనం చూసి నవ్వుతున్నారు. నేనేం చేయాలి?'' అని అడిగాడు.

''అవును, పాపం! నీది, నా కంటే కూడా పరమ దీనస్థితి,'' అన్నాడు సోమయ్య జాలిగా.

''నువ్వనే పరమ దీనస్థితి నాది కాదు; నీది!'' అన్నాడు మరుగుజ్జు.

''అదెలా?'' అన్నాడు సోమయ్య ఆశ్చర్యంగా.

''నువ్వు లావుగా వుండడంవల్ల, నీకు వచ్చిన నష్టమేముంది? అన్ని పనులూ బాగానే చేసుకోగలుగుతున్నావు. అయితే, అందరూ నిన్ను చూసి నవ్వుతున్నారని, సన్నబడాలనుకుంటున్నావు. అంటే, నిన్ను

చూసి నవ్వేవాళ్ళ కోసం, నువ్వు శ్రమ పడాలనుకుంటున్నావన్న మాట! మరి, నీది దీనస్థితి కాక మరేమిటి?'' అన్నాడు మరుగుజ్జు.

''అయితే, నిన్ను చూసి ఎవరైనా నవ్వితే, నీకు బాధగా వుండదా ?'' అని అడిగాడు సోమయ్య.

''మొహమాటపడకుండా ఒక సంగతి చెప్పు! నా ఆకారం చూసి చాలామంది నవ్వుతారు. వాళ్ళతోపాటు నువ్వూ నవ్వుతావా లేదా ?'' అన్నాడు మరుగుజ్జు.

సోమయ్య ఆ మాట నిజమేనని ఒప్పుకున్నాడు. ''అలాగే, నీ ఆకారం చూసి నవ్వేవాళ్ళతో, నేనూ నవ్వుతాను. అవునా ?'' అన్నాడు మరుగుజ్జు.

''అంతేగదా మరి! నీ ఆకారం చూసి నాకూ, నా ఆకారం చూసి నీకూ నవ్వు రావడం సహజం,'' అన్నాడు సోమయ్య.

''అదీ సంగతి! ఇప్పుడు మన సమస్యల పరిష్కారానికి ఎంత సులువైన మార్గం వున్నదో చెబుతా విను. ఎవరైనా నిన్ను చూసి నవ్వారనుకో, అప్పుడు నువ్వే నేననుకో. నన్ను చూసి ఎవరైనా నవ్వినప్పుడు, నేనే నువ్వనుకుంటాను. ఇంక బాధేముంది ?'' అన్నాడు మరుగుజ్జు నవ్వుతూ.

మరుగుజ్జు మాటల్లో ఎంతో నిజం వున్నదనిపించింది, సోమయ్యకు. ఆరోగ్యం బావున్నప్పుడు ఎవరో చూసి నవ్వారని మన శరీరాన్ని బాధ పెట్టుకోవడం ఎందుకు ? ఆహార పానీయాలపట్ల వున్న ఇష్టాన్ని చంపుకోవడం ఎందుకు ?

సోమయ్య, మరుగుజ్జుకు నమస్కరించి, ''నీకు ఆతిథ్యం యివ్వడం, నాకు మేలే అయింది. నువ్వు మహా జ్ఞానిలా హితబోధ చేశావు. ఇంక నాకు ఏ సమస్యలూ లేవు,'' అన్నాడు.

ఆ తర్వాత సోమయ్య లావు తగ్గలేదు కానీ, అతణ్ణి చూసి నవ్వే జనం క్రమంగా తగ్గిపోయారు. ఎదటివాడికి బాధ కలిగించలేనప్పుడు, అలా నవ్వడం ఎవరికీ యిష్టం వుండదు.






# త్యాగఫలం

ఇరాక్ దేశంలోని ఒకానొక ప్రాంతంలో, ఒక చిన్న రాజ్యం వుండేది. ఆ రాజ్యాన్ని యువకుడైన రాజొకడు పాలిస్తూండేవాడు. అతడికి తన రాజ్యంలో బిచ్చగాళ్ళు లేకుండా చేయాలన్న చక్కటి ఆలోచన కలిగింది.

రాజు రాజ్యంలోని అన్ని ప్రాంతాలకూ తన ఉద్యోగులను పంపాడు. వాళ్ళు పని చేయగల శక్తివున్న వాళ్ళందరికీ పనులు చూపించారు. ముసలితనం, అంగ వైకల్యంలాంటి వాటివల్ల, పనిపాటులు చేయలేనివారికి సత్రాలు పెట్టి, ఉచితంగా భోజనసౌకర్యాలు ఏర్పరిచారు.

రాజు ఇంతమంచి ఏర్పాట్లు చేసినా, భోజనసత్రాల నుంచి కొందరు పారిపోయి బిచ్చమెత్తడం ప్రారంభించారు. ఇది చూసి రాజు మండిపడ్డాడు. ఆయన రాజ్యంలో బిచ్చగాళ్ళకు ధర్మంచేసే వాళ్ళ చేతుల్లో ఒకటి నరకబడుతుందని చాటింపు వేయించాడు.

ఒకనాడు రాజుగారి చెల్లెలు తన మేనమామను చూడబోయి, రాజభవనానికి తన ఇద్దరు చెలికత్తెలతో తిరిగి వస్తున్నది. దారిలో వాళ్ళకు ఒక ఉద్యానవనం కనిపించింది. అందరూ అక్కడి చెట్లనీడలో విశ్రమించదలిచారు. అది భోజనం వేళకావడంతో, రాజు చెల్లెలు తన చెలికత్తెలకు రెండేసి రొట్టెలు యిచ్చింది.

చెలికత్తెలలో ఒకతె ఉద్యానంలో నీళ్ళకోసం వెతుకుతూ, ఒక చెట్టుకింద పడివున్న ఒక ముసలివాణ్ణి చూసింది. వాడు నీరసంవల్ల లేవలేనిస్థితిలో వున్నాడు.

చెలికత్తె వాణ్ణి సమీపించి, "ఎందుకలా పడివున్నావు?" అని అడిగింది.

ముసలివాడు ఆయాసపడుతూ, "అమ్మా, నేనొక తీర్థయాత్రికుణ్ణి.



''రాకుమారీ, నాకు రాజాజ్ఞ తెలియక పోలేదు. ఆయన రాజ్యంలో బిచ్చగాడనే వాణ్ణి లేకుండా చేయాలనుకోవడం మంచిదే. ఆ బిచ్చగాళ్ళలో చాలామంది దొంగలూ, సోమరిపోతులూ. కాని, యీ ముసలివాడు బిచ్చగాడు కాదు, తీర్థయాత్రికుడు. దొంగల కారణంగా అంతా పోగొట్టుకుని, ఆకలితో అలమటించిపోతున్నాడు,'' అంటూ రొట్టెలను ముసలివాడికిచ్చింది చెలికత్తె.

''ఏదో కుంటిసాకుతో రాజాజ్ఞా, నా ఆజ్ఞా కూడా ధిక్కరిస్తున్నావన్నమాట!'' అని రాజుగారి చెల్లెలు రాజభవనం చేరుతూనే, చెలికత్తె ఎవడో బిచ్చగాడికి రొట్టెలు ధర్మం చేసినట్టు రాజుతో చెప్పింది.

''అయితే, దాని చెయ్యి ఖండించక తప్పదు,'' అని, రాజు చెలికత్తెను భటులకు అప్పగించాడు. వాళ్ళు ఆమెను తీసుకుపోయి ఒక చెయ్యి నరికారు.

భటులు చెలికత్తెను తమవెంట తీసుకుపోతున్న సమయంలో రాజు ఆమె ముఖంకేసి చూశాడు. ఆ అందం, నిర్భయత్వం, ప్రశాంతతా అతణ్ణి బాగా ఆకర్షించినై. కాని, నలుగురూ పక్షపాతం చూపాడని భావించవచ్చున్న భయంతో, తన ఆజ్ఞను ఉపసంహరించుకోలేకపోయాడు. ఆ రాత్రి అతడికి పశ్చాత్తాపంతో నిద్రపట్టలేదు.

దొంగలు నా దగ్గిర వున్నదంతా దోచుకున్నారు. ఆ తరవాత జ్వరం వాతపడ్డాను. ఇప్పుడు దానినుంచి కోలుకున్నానుగాని, ఆకలితో ప్రాణం కడబట్టింది,'' అన్నాడు.

చెలికత్తెకు ముసలివాడిపై జాలి కలిగింది. ఆమె తన దగ్గిరవున్న రెండు రొట్టెలనూ వాడికివ్వబోతున్నంతలో వెనుకనుంచి రాజుగారి చెల్లెలు కోపంగా కేకపెట్టింది.

చెలికత్తె బెదిరిపోతూ వెనుదిరిగి చూసింది. రాజు చెల్లెలు గబగబా ఆమెను సమీపించి, ''నీకంత పొగరా? ఎవరికీ బిచ్చం పెట్టకూడదన్న రాజాజ్ఞ నీకు తెలియదా?'' అన్నది కసురుకుంటూ.

మర్నాడు రాజు తన అంతరంగికుల ద్వారా చెలికత్తెను గురించి వాకబు చేశాడు. అందరూ ఆమె అందచందాలను గురించేకాక, ఆమె ఎలాంటి దయాగుణం గలదో, ఉత్తమురాలో అతడికి చెప్పారు. ఇంకా వివాహం కాని రాజు, వారం తిరక్కుండానే మొండిచెయ్యి చెలికత్తెను వివాహం చేసుకున్నాడు.

ఈ వివాహం రాజు చెల్లెలికి పెద్ద కోప కారణం అయింది.

రాణీ అయిన తరవాతకూడా చెలికత్తె, రాజు చెల్లెలిపై పగ సాధించాలన్న ప్రయత్నం చెయ్యలేదు. కొంత కాలం గడిచింది. ఆమె గర్భవతి అయి, ఒక కుమారుణ్ణి కన్నది. ఇది, రాజు చెల్లెలికి, రాణీపై మరింత ద్వేషం కలిగించింది.



ఒకసారి రాజు ఏవో పనులమీద కొద్ది నెలల పాటు నగరంలో లేక పోవడం జరిగింది. ఇది అదనుగా తీసుకుని రాజు చెల్లెలు, తన చెలికత్తెలలో దుష్టస్వభావులైన వాళ్ళ సాయంతో రాణీ మంత్రగత్తె అని పుకార్లు లేవదీసింది. ఆమె మంత్రగత్తె కాకపోతే, మొండి చేతి దానిని రాజు ఎలా వివాహం చేసుకుంటాడు? అని వాళ్ళు పదిమందిలో అనసాగారు.

రాజు ముసలితల్లికి మంత్రగత్తెలంటే తగని భయం. పైగా, మొదటినుంచీ ఆమె మొండిచెయ్యి పిల్ల తనకు కోడలుకావడం అవమానంగా భావిస్తున్నది. ఈ కారణాల వల్ల ఆమె, రాజభవనం కాపలా కాసే వాళ్ళని పిలిచి, కోడలిని ఎడారిలో ఎక్కడైనా వదిలిపెట్టి రమ్మన్నది. కాపలా వాళ్ళు రాణీని, ఆమె కొడుకునూ తీసుకుపోయి, ఎడారిలో వదిలారు.

అది మధ్యాహ్నం సమయం. దాహం కావడంతో రాణీ తన కొడుకును చంకన పెట్టుకుని ఎడారిలో కొంతసేపు తిరగగా, ఆమెకు కొంతదూరంలో ఒక చిన్న నది కంటబడింది. దాహం తీర్చుకునేందుకామె నది దగ్గిరకుపోయి, ఒక చేత్తో కొడుకును పట్టుకుని, రెండోచెయ్యి లేనిది

కావడం వల్ల నోటితో నీళ్ళు తాగేందుకు ముందుకు వంగింది.

ఆ సమయంలో ఆమె కొడుకు చేతి పట్టునుంచి జారి నదిలో పడి, ప్రవాహ వేగానికి కొట్టుకుపోయాడు. అది చూసి రాణీకి దుఃఖం ఆగలేదు. ఆమె పెద్దగా దుఃఖిస్తూ నది ఒడ్డునే కూర్చున్నది.

కొంత సేపటికి చీకటి పడి, చంద్రోదయ మయింది. రాణీ దుఃఖంతో నీరసపడి మగతనిద్రలో వుండగా, ఎవరో మృదువుగా, "రాణీ, నీకు పోయిన కొడుకు కావాలని వున్నదా?" అని అడిగారు.

"అవును, తప్పక కావాలి!" అంటూ రాణీ కళ్ళు తెరిచి చేతులు చాచింది.

వెన్నెల వెలుగులో కనబడీ కనబడ నట్టున్న ఒక చిన్న ఆకారం రాణీకి కొడుకును అందించింది.

ఒకటి, రెండు క్షణాలు గడిచేంతలో మరొక మృదువైన కంఠస్వరం, "రాణీ, నీవు పోగొట్టుకున్న చేయి తిరిగి రావాలని కోరికగా వున్నదా?" అన్నది.

"అవును, నాకు రెండవ చెయ్యి కూడా వుంటే ఎంత బావుండును!" అన్నది రాణీ దీనంగా.

ఆ వెంటనే రాణీ మొండిచెయ్యి యథాప్రకారం మామూలు చెయ్యిగా మారిపోయింది.

అప్పుడు ఆ ఆకారాలు రెండూ, రాణీని దీవించి, "నువ్వు యిక్కడే వుండు. రాజు తన నగరానికి తిరిగిపోతూ, యీ దారినే వస్తాడు. నిన్ను చూసి అతడు పరమానందం చెందగలడు," అన్నవి.

రాణీ ఎంతో ఆశ్చర్యంగా, "నాకు యింతమేలు చేసిన, మీరిద్దరూ ఎవరు?" అని అడిగింది.

"నువ్వు చేసిన త్యాగఫలితంగానే, నీకింతమేలు జరిగింది. ఆనాడు మరణ దశలోవున్న తీర్థయాత్రికుడికి రెండు రొట్టెలిచ్చి, అతడి ప్రాణాలు కాపాడావు. మేమే ఆ రెండు రొట్టెలం!" అని చెప్పి, ఆకారాలు రెండూ చంద్రకాంతిలో కలిసి పోయాయి.



# ఉత్తరువులో మార్పు

లక్షణదేశంలోని ప్రధాననగరాలలో ఒకటైన లావణ్యపురిలో, చీకటిపడిన తరవాత దుండగులూ, బందిపోట్లూ నగరవీధులలో ప్రజలపైబడి దోచుకోవడం, కొట్టడం సాగించారు. దీనితో చీకటి పడ్డాక ప్రజలు నగర వీధుల్లో స్వేచ్ఛగా తిరగలేని పరిస్థితి ఏర్పడింది. నగరవాసులు యీ విషయాన్ని, నగరపాలకుడు విరూపాకుడి దృష్టికి తెచ్చారు. ఆ మర్నాడే ఆయన చీకటి పడ్డాక ప్రజలు నగర వీధులలో తిరగరాదంటూ ఉత్తరువు జారీ చేసాడు.

ఈ ఉత్తరువువల్ల సాయంకాలం అయ్యేసరికి నగరజీవితం స్తంభించిపోవడమే కాక, వర్తకవ్యాపారాలు బాగా దెబ్బతిన్నవి. నగరప్రముఖులు కొందరు రాజధానికి వెళ్ళి, యీ విషయాన్ని మహారాజుకు విన్నవించుకున్నారు.

అయన మంత్రిచేత విరూపాక్షుడికి యిలా లేఖ రాయించాడు : దుండగులూ, బందిపోట్ల వల్ల కష్టం కలగకూడదన్న సదుద్దేశంతో, రాత్రిళ్ళు ప్రజలను వీధులలో తిరగకూడదనడం మంచిదే. కాని, న్యాయానికి అన్ని వేళల్లోనూ నిర్భయంగా వీధులలో తిరగవలసింది ప్రజలు కాని, దుండగులు కాదు! అందుచేత, నువ్వు ప్రజల మీద విధించిన ఆంక్షలను, నేరస్థులకు మాత్రమే పరిమితం చేస్తూ, ఉత్తరువును సవరించవలసిన అవసరం మాకు కనబడుతున్నది.

ఈ లేఖను అందుకున్న విరూపాకుడికి, అందులో వున్న మందలింపు అర్థమయింది. అతడు తక్షణమే నేరస్థులందరినీ పట్టుకోవడానికి తగిన ఏర్పాట్లుచేసి, త్వరలోనే నగరంలో శాంతి భద్రతలు పునరుద్ధరించాడు.

—కమలిని



## ఫోటో వ్యాఖ్యల పోటీ : : బహుమానం రు. 50 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1984 మార్చి నెల సంచికలో ప్రకటింపబడును.



P. V. Subramaniam



M. C. Morabad

★ పై ఫోటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్క మాటలో గానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.) ★ జనవరి నెల 15 వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. ★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 50/–లు బహుమానం. ★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన రాసి, ఈ అడ్రసుకు పంపాలి:– చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు-26

---

### నవంబర్ నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో: తిండి కోసం మాటు

రెండవ ఫోటో: చదువు కోసం పాటు

పంపినవారు: శ్రీమతి ఎస్. అన్నపూర్ణ, అశోక్‌నగర్, హైదరాబాదు-20

*బహుమతి మొత్తం రు. 50/–నెలాఖరులోగా పంపబడుతుంది.*

### మీకు తెలుసా? సమాధానాలు

1. నైరుతీ కెన్‌టకీలో. ఇక్కడి భూగర్భంలో వందల మైళ్ళ పొడవుగల గుహలు వున్నాయి. 2. గ్రీన్‌లాండ్‌లోనూ, ఆర్కిటిక్, అంటార్కిటిక్ సముద్రప్రాంతాలలోనూ వున్నాయి. 3. దక్షిణాఫ్రికాలో వున్న టేగ్లా జలపాతం. దీని ఎత్తు 2,810 అడుగులు. 4. దక్షిణ అమెరికా, భూమధ్యరేఖ దగ్గిర వున్న చింబొరాజో అగ్ని పర్వతం. 5. ఉదయపూర్‌కు 48 కి. మీ. దూరంలో వున్న జైసామండ్.

Printed by B. V. REDDI at Prasad Process Private Ltd., and Published by B. VISWANATHA REDDI for CHANDAMAMA CHILDREN'S TRUST FUND (Prop. of Chandamama Publications) 188, Arcot Road, Madras-600 026 (India). Controlling Editor: NAGI REDDI.



జుట్టు అద్భుతంగా ఉండేటట్టు చేసేది రీటా. దానిలో అటువంటి శక్తి, సువాసనా ఉన్నాయి - శిరోజాలు సహజంగా, చక్కగా పెరగడానికీ, చల్లదనానికీ, దానికదే సాటి.

రీటా వాడి మీ కురుల సౌభాగ్యాన్ని వృద్ధి చేసుకోండి. మీ శిరోజాలు ఏపుగా, ఒత్తుగా పెరిగి నిగనిగలాడుతూ మెత్తగా ఉంటాయి.




# రీటా

నేడే ఒక సీసా కొనండి
ప్రతిచోటా దొరుకును

స్త్రీలూ పురుషులూ వాడవచ్చును

ఇప్పుడు సూపర్ ఎకానమి (100 ml) సైజులో కూడా వస్తున్నది.